*"The Security of the nation is not at the ramparts alone. Security lies in the value of our free institutions. A cantankerous press, an obstinate press, a ubiquitous press must be suffered by those in authority in order to preserve the even greater values of freedom of expression and the right of the people to know"*

—Judge Murray I. Gurfein.

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

నిర్వహణ : 'సాహితీ మిత్రులు'

వెల : ఒక రూపాయి

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

## 23

మాసపత్రిక

ఆగస్టు 1971

నిర్వహణ :

'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా: పదిరూపాయలు          విడిప్రతి: ఒకరూపాయి

---

**SRJANA** is commended for use in Public Libraries in the state by the Director of Public Libraries, Andhra Pradesh, Hyderabad, wide Re. No. 182/A4/67, Dated 22-9-1967.

# సృజన

## ఆధునిక సాహిత్య వేదిక

ఆగస్టు 1971 | మాసపత్రిక | 23



వచ్చేసంచికలో

ఆధునిక సాహిత్య చరిత్ర: సమాజం- కవిత్వం- విప్లవం- అద్దేపల్లి రామమోహనరావు.

కవితలు: తూర్పు పవనం వీచెనోయ్ః — గంగు

కామేడ్ — చెరబండరాజు

బందిఖానాలో బాలచంద్రుడు — కె. వి. రమణారెడ్డి

కథ: మంచం — జంపన పెద్దిరాజు

# 'దాచేస్తే దాగని సత్యం'

'దేశభద్రత కేవలం రక్షణవ్యూహంలోనే లేదు. అది మన స్వచ్ఛంద సంస్థల విలువలపై కూడా ఆధారపడివున్నది. ఎప్పుడూ సంఘర్షణపడే, తగువుపెట్టుకొనే పత్రికలను, మొండి ధైర్యంతో రానేపత్రికలను, అంతటా తామైవుండే పత్రికలను- దేశభద్రతకన్నా విలువైన భావప్రకటనా స్వేచ్ఛా, (ప్రజలు) తెలుసుకునే హక్కులను కాపాడడానికి, అధికారంలోవున్నవాళ్ళు సహించకతప్పదు'- ముర్రే ఐ. గర్ఫెన్. (అమెరికా సుప్రీంకోర్టు జడ్జ్.)

న్యూ యార్క్ టైమ్స్, యింకా యితర పత్రికలకూ ప్రభుత్వానికీ పెంటగన్ రహస్యాలు బయటపెట్టినందుకు వచ్చిన తగాదాలో పత్రికల భావ ప్రకటనా స్వాతంత్ర్యాన్ని, ప్రతి విషయాన్ని తెలుసుకోవడానికి ప్రజలకున్న హక్కును సమర్థిస్తూ అమెరికా సుప్రీంకోర్టు తీర్పు యిచ్చింది. ఒక పెద్ద పెట్టుబడిదారీ దేశంలో, దాదాపు అన్నీ పెట్టుబడిదారీ పత్రికలే 'ప్రజలకోసం' ప్రభుత్వపు రహస్యాతిరహస్య విధ్వంసనాలోచనలను బయటపెట్టాయి. ఇది ఇండియాలోనయితే పెద్దఆశ్చర్యమే. మనకు దేశమంటే ప్రజలుకాదు ఎల్లలు. మనకు పత్రికలంటే బాకాలు. మనకు సాహిత్యమంటే వందిమాగధ అకాడమీలు. 'దేశభక్తి'ని ప్రకటించే భావప్రకటన స్వేచ్ఛను ప్రజా శ్రేయస్సును కోరే హక్కుగా పొరపాటుపడితే అది 'రాజద్రోహం' అవుతుంది. అసలు మన చట్టంలోనే రాజద్రోహ నేరానికి శిక్షవున్నది కాని ప్రజాద్రోహ నేరానికి శిక్షలేదు. ఇదీ ప్రజలకోసం, ప్రజలచేత, ప్రజలతో పాలింపబడు తున్న దేశం!

అమెరికా ప్రభుత్వం, ముఖ్యంగా పెంటగాన్ ఎంతగా వియత్నాం విధ్వంసాన్ని, తద్వారా ఆసియా ప్రజల స్వేచ్ఛా వాయుబంధనాన్ని అభిల షిస్తున్నదో, అమెరికా ప్రజలు, పత్రికలు అంతగా లింకన్ మాటలకు అర్థాలు వెతుకుతున్నయి. అందుకే చివరకు ఆ కాగితాల్లో ఏముందో మేం చూడాలి, ఆ రహస్యాలు ఎట్లా బయటపడ్డాయనికాదు. అసలు రహస్యమేమిటి అన్నది ప్రజలకు కావాలి- అని అమెరికన్ సెనేట్, కాంగ్రెస్‌లు కూడా, కోరకతప్పలేదు. మాక్స్‌వెల్ 'ఇండియా'స్ చైనావార్, అనే పుస్తకం బయటికి వచ్చినపుడు అందులో మన పార్లమెంట్ సభ్యులకుకూడ తెలియని ప్రభుత్వ రహస్యాలు బయటపడితే- అవి ఒక విదేశ పాత్రికేయునికి ఎట్లా తెలిసాయి

అనే గొడవపెట్టాయి తప్ప మన పత్రికలూ, పార్లమెంటూ- అందులో సత్యాసత్యాలేమిటి అనే జిజ్ఞాస ఒక్కరూ చేయలేదు. ఇదీ మనకు భావప్రకటన స్వేచ్ఛ గురించి వున్న అవగాహన.

ప్రభుత్వాలు ఎప్పుడూ గద్దెలు కాపాడుకొనే ప్రయత్నాలు చేస్తాయి. అందుకోసంవాటికి తుపాకీలు, మింటులూ వున్నాయి. అవిచేసే దారుణాలను అబద్ధంగా చిత్రించే సమాచార ప్రచార శాఖలవంటి ఎంతో యంత్రాంగం వున్నది. మేధావులు, పత్రికలు అదనంగా పంచమాంగదళం కావలసిన అవసరం లేదు. ఇది ప్రభుత్వాన్ని శత్రువుగాభావించి చెప్పినమాటకూడ కానక్కర్లేదు. ప్రభుత్వం ప్రజల మిత్రుడనుకొన్నపుడు కూడ మిత్రునికి కావలసింది హితం కాని ప్రియవచనాలు కాదు. ప్రియవచనాలకోసం చొంగలుకార్చేవాళ్ళు పేక మేడల్లా కూలిపోతారు. కుర్చీమీద కూర్చున్నవాళ్ళకు హితం చేదుగావుంటుంది. అట్లని చెప్పేవాడుకూడ తనబాధ్యత విస్మరిస్తే జాతికి భవిష్యత్తులేదు. రోగికి ఆపరేషన్ అవసరమో కాదో నిర్ణయించాల్సిన బాధ్యత డాక్టర్‌ది. ఈ సమాజంలో మేధావిపాత్ర అలాంటిదే.

అడవిపూలను అమాయకులను అర్భకులను, అన్నెం పున్నెం ఎరుగని వారిని, అలగాజనాన్ని ఇనుప బూట్లతో తొక్కడంగాని, జైళ్ళలో కుక్కడంగాని, మానాలు అభిమానాలు చెరచడంగాని ప్రభుత్వానికి పెద్దపనికాదు. పథ్యం పాటించటం కష్టంగాని పాటించకపోవడం చాల సులువు. కాని అమాయకుల రక్తంతో తడిసిన తుపాకి బానెట్‌ను నీగుండెమీదదించి నీకలాన్ని రెండుగా చీల్చాలని దమననీతి ప్రయత్నించినపుడు కూడ నీవు మెరుస్తున్న కత్తిపక్షంకాక అది కారుస్తున్న రక్తంపక్షం వహించిననాడు నీవు నిజంగా నీ భావప్రకటనా హక్కును దక్కించుకున్నట్లు. తిరుగుబాటుకు కావాలిగాని కలం బలం తుపాకికి ఎందుకు?

భావప్రకటన అంటే ప్రజాశ్రేయోభావప్రకటన అని, న్యాయాన్ని కాపాడడమంటే ప్రజాన్యాయాన్ని కాపాడడమని మనపత్రికలు, న్యాయస్థానాలు, కనీసం అమెరికానుంచి నేర్చుకోడానికయినా అభ్యంతరం వుండకూడదు మరి. సాహిత్యం మనదేశంలో 'వందిమాగధ' స్థాయినుంచి శబ్దసార్థకత సాధించడానికైనా 'సాహిత్య'స్థాయికి ఎదుగుతుందని ఎదురుచూద్దాం.

— సంపాదకుడు.

# మంచి

ఎన్. ఎస్. ప్రకాశరావు

పూర్వం భరతఖండంలోనే 'పుణ్యభూమి' అని ఒక చిన్నరాజ్యం వుండేది. ఆ రాజ్యంలో పుణ్యాత్ములు చాలామంది పుట్టేరుట. అందుకనే, దానికాపేరు వచ్చిందని చెప్పుకునేవారు.

పుణ్యభూమిలో 'విద్యానిధి' అని ఒక గురువుగారు వుండేవారు. ఆయనకి సకల విద్యలూ వచ్చునట. పుణ్యభూమిలో పుట్టిన పుణ్యాత్ముల్లో ఆయనకూడా ఒకరని అంతా అనుకునేవారు. ఆయన్నిగురించి ఎవరెంత పొగిడినా, ఎంత గొప్పగా చెప్పుకున్నా, ఒక నిప్పులాంటి నిజం మాత్రం వుంది.

విద్యానిధిగారి దగ్గరికి విద్యాభ్యాసం కోసం ఎక్కువ మంది వచ్చేవారు కారు!

ఎందువల్ల ?

శిష్యులచేత అడ్డమైన చాకిరీ చేయించుకుంటారనా? పాఠాలు ఎగ్గొట్టి, వూసుపోక కబుర్లుచెబుతూ. రోజులు వెళ్ళబుచ్చుతారనా ? శిష్యుల్ని కొడతారనా. తిడతారనా ? లేకపోతే, ద్రోణాచార్యుల్లాగ ఆయనకేమైనా కులతత్వం నరనరాల్లో జీర్ణించుకు పోయిందనా ?

ఎందువల్ల ఆయన శిష్యుల్ని ఆకర్షించలేక పోతున్నారు?

ఈ ప్రశ్నలు ఆ రోజుల్లో చాలామంది బుద్ధిమంతుల్ని వేధించేయిట.

కాని, విద్యానిధిగారిలో ఈలక్షణాలు కంచు కాగడాలువేసి వెతికినా కనిపించవని ఆనాటి పండితులు సరేసరి; వణిక్ప్రముఖులూ, రాజ దర్బారులోని పెద్దలూ కూడా అనేవారు.

మరైతే, ఆయనకి శిష్యులు లేకపోవడానికి కారణం ఏమిటి?

"విరబూసిన పారిజాతానికి గొంగళిపురుగులు పట్టినట్టు", అంతగొప్ప గురువు గారిలోనూ ఒకేఒక 'దుర్గుణం' వుండేదిట. అదేమిటంటే, ఆయన తనకి తారసపడిన

వాడినల్లా —"బాబూ! మంచిగావుండు నాయనా! మంచిని పెంచు బాబూ!" అనే వారుట. అంతే!

అయితే,

మంచిగా వుండమని ఎంతమంది చెప్పడంలేదు? అంతమాత్రానికే శిష్యులు రాకపోవాలా?

అదీకాదుట అసలుకారణం. విద్యానిధిగారి దగ్గరికి కొన్నేళ్ళకిందట, పుణ్యభూమి యువరాజు విద్యాభ్యాసంకోసం వచ్చేడు. మరి, ఆ తరవాత ఏం జరిగిందో, ఏమో? ...విద్యాభ్యాసానంతరం, ఆ యువరాజు తండ్రిగారి దగ్గరికి వెళ్ళి, "నాకు పట్టాభిషేకం చెయ్యొద్దు! నేను పరిపాలన చెయ్యను!" అన్నాట్ట. ఎవరెంత చెప్పినా విన్నాడుకాడుట. ఆ బెంగతో, ఆ రాజుగారు మంచం పట్టేరుట ఇదే అదునని ఆ రాజుగారి తమ్ముడి కొడుకు, సింహాసనాన్ని ఆక్రమించేడు

మరి, ఆ యువరాజేమయేడు?....'మంచితనం పెరగాలి!' అని పిచ్చివాడిలా(!) అరుస్తూ, రాజవీధుల్లో తిరిగి తిరిగి, ఆఖరికి అడవులుపట్టి పోయేట్ట. ఇప్పటికీ అతనేమైపోయేడో ఎవరికీతెలీదు.

ఇలాగే, ఒక వైశ్య శిఖామణికూడా తన కుమారరత్నాన్ని విద్యానిధి దగ్గరికి చదువులకి పంపించేడు. 'ఈపెద్ద చదువులన్నీ నీకొడుక్కి కూడా ఎందుకు? వాడిక్కావల్సిన చదువేదో నువ్వేచెప్పగలవు కదా!' అని చాలామంది శ్రేయోభిలాషులు ఆవణిక్ప్రముఖుడికి చెప్పేరుట. అయినా, అతను వాళ్ళమాటలు విన్నాడుకాడు.

ఫలితం అనుభవించేడు!

ఆ పుత్రరత్నంకూడా, విద్యాభ్యాసం అయిపోవగానే ఇంటికి వెళ్ళి, తండ్రికి వ్యాపారంలో సాయం చెయ్యవల్సింది పోయి, మీదుమిక్కిలి ఎదురు తిరిగి తండ్రికే సలహాలు ఇవ్వడం మొదలెట్టేడుట. —ఈ వ్యాపారం మానెయ్యమనీ! ... కనీసం లాభాలు గడించడమైనా మానెయ్యమనీను!

ఆ వ్యాపారస్థుడు నెత్తీనోరూ బాదుకొని, కొడుక్కి నచ్చజెప్పబోయేట్ట. కాని, అది "చెవిటివాడి ముందు శంఖం వూదినట్టే" అయింది.

"నా ఆస్తిలో చిల్లిగవ్వ నీకివ్వను. ఆ తరవాత నీగతి కుక్కలక్కూడా పట్టదు!" అని నయానా భయానాచెప్పి చూసేట్ట ఎన్నిచెప్పినా, ఆకొడుకు– 'లాభాలు తియ్యడం మాన' మనే అన్నాడుకాని, మరోమాట అనలేదుట.

తరవాత ఏఁవుంది ?

తండ్రీ కొడుకూ విడిపోయేరు.... కన్నకొడుకు, కళ్ళముందరే కూలీగా మారి పోయేడన్న కఠోరసత్యాన్ని కడుపులో పెట్టుకొని (కుములుతూనే) ఆ వైశ్య శిఖామణి తన మామూలు వ్యాపారం మామూలుగా ఒంటరిగానే చేసుకొంటూ బతికేడు.

వీళ్లు చాలరా ?... విద్యానిధులవారి శిష్యులకి మచ్చుతునకలు !

మహారాజు కొడుక్కే దిక్కు లేకపోయింది కదా ! చదువుకుందికని వెళ్ళిన పిల్లలు 'మంచి'ని సాధిస్తాఁవని ఇళ్ళు వదిలిపోతే, కడుపు కట్టుకొని చదివించే సామాన్యుల గతేంకావాలి ? ... మొత్తంమీద విద్యానిధిగారికి శిష్యులులేరు !

ఆ తరువాత ఆయన కొన్నేళ్ళపాటు, 'నిరుద్యోగం'తో బాధపడవలిసొచ్చింది. ఆయన అంత కష్టదశలో వున్నప్పుడుకూడా, ఆయన మంచితనాన్నీ, విద్యాపారంగత్వాన్నీ నగరంలోని పండితులూ, ప్రముఖులూ ప్రశంసించడం మాత్రం మానలేదు. (పొగడ్తలు ఆకలి తీర్చవుకదా !)

ఇలా వుంటూవుండగా, పుణ్యభూమి రాజధానికి ఏభైయోజనాల దూరానవున్న ఒక పల్లెటూరునించి 'అమాయకుడు' అనే యువకుడు విద్యానిధులవారి దగ్గరికి చదువుకుందికివచ్చేడు. ఆ యువకుడి అసలుపేరు ఇంకేదో వుందిట. కాని, అతన్ని ఎరిగిన వారంతా అతనికి ఆపేరే స్థిరపరిచేరట.

అమాయకుడికి కూడా, విద్యానిధిగారిలాగే, చిన్నప్పట్నించీ మంచి అంటే చచ్చేంత ప్రేమట. అతను విద్యానిధి గారి దగ్గిరికి రాకముందు నలుగురైదుగురు గురువులని కొలిచేడట కాని; ఆగురువుల—గూడు పురాణీలు; వారి కులాభిమానాలు; శాఖాభిమానాలు, ధనాపేక్షలు; కక్షలు—చూసేక; వాళ్ళకి మంచిని బోధించబోయాడట. వాళ్ళు ఇతన్నీ; ఇతని 'మంచి'నీ భరించలేక; 'నీలాంటివాడికి ఆవిద్యానిధి ఒక్కడే తగును. అక్కడికి పో!' అన్నారట.

అయితే, అమాయకుడు శిష్యరికానికి వచ్చేసమయానికి విద్యానిధి వృద్ధులై పోవడమే కాకుండా, పక్షవాతంతో మంచం పట్టేరు కూడాను.

అయినప్పటికీ, ఆపుణ్యాత్ముడు ఈఅమాయకుణ్ణి చేరదీసి; విద్యాబుద్ధులు నేర్పసాగేరు. అమాయకుడు కూడా ఎంతోభక్తి శ్రద్ధలతో గురువుగారికి శుశ్రూష చేస్తూ వుండేవాడు. కాని, కొన్నాళ్ళతరువాత ఒకరోజున హఠాత్తుగా విద్యానిధులవారికి

తను చచ్చిపోతానేమోనని అనుమానంవేసింది. వెంటనే, ఆయన అమాయకుణ్ణి దగ్గిరికి పిలిచి,

"చూడు నాయనా! ఇంకనేను ఎన్నోఘడియలు బతకను. ఈలోకంతో నాబాంధవ్యంతీరిపోతోంది. కాని, నాకుఒక్కటేబాధ. నేను నాజీవితంలో చేద్దామనుకొని చెయ్యలేకపోయిన పనిఒకటుంది. ఆపని నువ్వుసాధించాలి" అన్నారు.

"చెప్పండి స్వామీ! తప్పకుండా సాధిస్తాను. నా ప్రాణాలు పణంగా పెట్టైనా సాధిస్తాను సందేహించక చెప్పండి" అన్నాడు అమాయకుడు.

అప్పుడు ఆగురువుగారు చిరునవ్వునవ్వి 'అమాయకుడా! నాకుతెలుసు నువ్వు అందుకు సమర్థుడివే!'

.... విను. భగవంతుడు సృష్టించిన ఈలోకంలో, పిపీలికాది బ్రహ్మపర్యంతం అనేక జీవరాసులున్నాయి. కాని, వాటిలోమానవుడిదే మహోత్కృష్టమైనజన్మ. ఎందుకంటే, మానవుడికి మేధస్సుని ప్రసాదించేడుసర్వేశ్వరుడు. కాని, ఈమానవుల్లో కొందరు తమమేధస్సుని మోసాలు చెయ్యడానికీ, కుట్రలూ కుహకాలూ పన్నడానికీ, పొరుగువాడి పొట్టకొట్టడానికీ వినియోగిస్తున్నారేతప్ప, మరొకందుకు వినియోగించడం లేదు.... ఎందువల్లనంటావు?" —అని ఆగేరు విద్యానిధిగారు.

"పాపంపెరిగి పోతోందికదా గురువర్యా!

అదీగాక కలియుగం కదా!" అన్నాడు అమాయకుడు, 'ఇంతేకదా! అన్నట్టు,

"నాయనా! అది మ్లేచ్ఛులు చెప్పేమాట. అసలుకారణం అదికాదు. కొందరు మానవుల్లో దుర్మార్గత్వం ప్రబలిపోతోంది అంటే వాళ్ళలో మంచితనం మంటగలిసి పోతోందన్నమాట వాళ్ళలోనూ భగవంతుడున్నాడు. నువ్వుచెయ్యవల్సిందల్లా ఒక్కటే! ఆ దుర్మార్గుల్ని సన్మార్గులుగా మార్చు. వాళ్ళలో మంచిని పెంచు నువ్వు వాళ్ళకి నచ్చజెప్పితే, వాళ్ళలోవున్న భగవంతుడు వాళ్ళని తప్పక మారుస్తాడు ... నాకుతెలుసు. నువ్వు ఆపని చెయ్యగలవు" అని గురువుగారు ఆగి, చిన్ననవ్వు నవ్వేరు.

అమాయకుడికి— గురువుగారి ఆ ఆజ్ఞవిన్నాకా, ఆ నవ్వు చూసేకా— ఉద్రేకం ఉప్పొంగింది. "అనుమానించకండి గురువర్యా! నేను తప్పక సాధిస్తాను. మంచిని పెంచి తీరుతాను. చెడ్డవాళ్ళలో నిద్రపోతున్న భగవంతుణ్ణి తట్టి లేపుతాను. మీరు నిశ్చింతగా వుండండి" అన్నాడు.

అయినా, ఇంకా గురువుగారు నవ్వుతూనే వుండడం చూసి, అతనికి అనుమానమూ అవమానమూ ఒకేసారి కలిగేయి.

"నన్ను నమ్మండి స్వామీ! సందేహాలన్నీ వదిలిపెట్టండి. నేను నా ప్రాణం పోయినా సరే, మంచిని పెంచుతాను" అన్నాడు మళ్ళీ.

అప్పటికీ విద్యానిధులవారు నవ్వుతూనేవున్నారు. అమాయకుడు భయపడుతూ ఆయన్ని కుదిపిచూసేడు. ఆయన తల ఒకపక్కకి వాలిపోయింది.

విద్యానిధులవారి నిర్యాణ వార్త నగరంలోనేకాక, పుణ్యభూమి అంతటా "కార్చిచ్చులా" వ్యాపించింది.

సంతాప సభలు పెట్టేరు. 'ఆయన మరణం పుణ్యభూమికి తీరనిలోటు' అంటూ కవులు కావ్యగానం చేసేరు. ఓ మహాకవి, 'ఆయనతోపాటే మంచికూడా మరణించింద'ని పద్యాలు రాసేడు కూడాను.

ఆతరవాత, రాజధానిలో చెరువుగట్టునవున్న పాలరాతి విగ్రహాలలో విద్యానిధులవారి విగ్రహంకూడా చేర్చాలని పెద్దలంతా నిశ్చయించేరు.

కొద్దిరోజుల్లోనే, తూరవతల చెరువుగట్టున విగ్రహం– విద్యానిధులవారి పాలరాతి చూడ ముచ్చటైనది– వెలిసింది

ప్రతీరోజూ, ఆవిగ్రహం పాదాలదగ్గిర అమాయకుడు విషణ్ణవదనుడై కూర్చొనేవాడు.

ఆ చెరువుగట్టున దాదాపు పదిదాకా విగ్రహాలున్నాయి. 'భగవత్సృష్టిలోని మానవులంతా సమానులు' అని చెప్పినాయన విగ్రహం, ఆ కొసానుంది. ఆయన పేరు, పుణ్యభూమిలో ప్రతి ఇంటా కనీసం ఒకరికైనా వుంది.

దానిపక్కనే వున్న విగ్రహం– 'స్వార్థమే అనర్థం' అన్న సూక్తిని చెప్పిన పుణ్యపురుషుడిది. ఆయన పుట్టినరోజు పండుగని ప్రతీ సంవత్సరం, పుణ్యభూమిలో మహావైభవంగా జరుపుతూ వుంటారు.

ఈ విగ్రహానికి ఎడమవైపున ఎత్తుగావున్న బుర్రమీసాలాయన పసితనంలోనే పరమ భాగవతోత్తముడిగా మారిపోయేరు. ఆయన బోధనలన్నీ ఒక్కముక్కలో చెప్పాలంటే– 'పేదలను ప్రేమించు'. ఆయన విగ్రహం కిందనే ఆమాట చెక్కివుంది.

ఈవిధంగా ఆచెరువు వొడ్డునవున్న విగ్రహాలన్నీ పుణ్యభూమి పేరు నిలబెట్టిన పుణ్యాత్ములవి. పుణ్యభూమి ప్రజలందరికీ ఈ విగ్రహాలు ఒట్టి (పాల) రాతిబొమ్మలు కావు; అవతారపురుషుల లీలామానుష విగ్రహాలు!

గురువుగారి విగ్రహం దగ్గిర అలా కూచుని కూచుని, ఆఖరికి ఒకరోజున—ఆయన పాదాలకిందవున్న మాటల్ని లక్షోసారి చదివేడు.

—'మంచిని పెంచు!'

గుండెలనిండా గాలిపీల్చుకొని, 'ఔను! నేను మంచిని పెంచుతాను!' అనుకొని గభీమనిలేచి, నగరంకేసి బయలుదేరేడు అమాయకుడు.

అప్పటికే బాగా చీకటిపడిపోయింది. దానికితోడు మంచుకూడా కురుస్తోంది. నగరంలోకి వెళ్తూవుంటే, ముందు కూలీనాలీ జనాల వాడలు తగుల్తాయి. పెద్దవాళ్ళ పాపం పేదవాళ్ళ నెత్తికెక్కినట్టు, ఆ పాకలమీద చక్కని చీకటిపరుచుకొని వుండి, అవి కనిపించడం లేదు అమాయకుడు ముందుకు సాగేడు

కార్తీకమాసం. నగరంలో — రాజప్రసాదాలూ, వ్యాపారస్థుల వాకిళ్ళూ, కవి పండితుల భవనాలూ, దేవాలయాలూ— అన్నీ (నేతి?) దీపాలతో కళకళ్లాడుతున్నాయి.

నగరం నడిబొడ్డునవున్న కన్యకాపరమేశ్వరీ ఆలయానికి వెళ్లేడు అమాయకుడు. కోవెల్లోపల శాస్త్రులవారు పురాణం చెప్తున్నారు. అప్పటికే ముగింపుకి వచ్చినట్టుంది: మరి కాసేపటికల్లా, ఆనాటి కథ ముగించి, 'సర్వేజనాస్సుఖినోభవంతు' అన్నారు శాస్త్రిగారు.

భక్తులంతా, ఒక్కొక్కరే (అతికష్టంమీద) లేస్తున్నారు. (వారిలో- పిల్లలంతా, పిల్లఏనుగుల్లాగానూ; పెద్దలంతా, ముసిలి ఏనుగుల్లాగానూ వున్నారు.) వారంతా లేచి, శాస్త్రిగారికి నమస్కరించి ఆయన పళ్ళెంలో యథాశక్తివేసి, భారంగా కదిలి పోతున్నారు

శాస్త్రులవారు పళ్ళెంలోకి చూసుకొంటూ, చేటంత మొహం చేసుకొని, ఇంకా ఎవరైనా వున్నారేమోనని తలెత్తిచూసేరు.

అమాయకుడు ఒక్కడే అక్కడ వున్నాడు.

అతన్ని చూడగానే, శాస్త్రిగారికి మొదట భయంవేసి, 'గతుక్కు' మన్నారు. కాని, అతని ముఖంలోకి మరోసారి చూసేక ఆ భయం పోయింది.

"ఎవరు నాయనా, నువ్వు? ఏం కావాలి?" అన్నారు శాస్త్రిగారు.

"నాకొక సందేహం వుంది స్వామీ! తమరు తప్పక తీర్చాలి" అన్నాడు అమాయకుడు.

"చెప్పు నాయనా!" అన్నారు శాస్త్రులవారు.

"మీరు ఎన్నాళ్ళనించి ఇలా పురాణం చెప్తున్నారు?"

ముప్పైఏళ్ళబట్టి చెప్తున్నానన్నారు శాస్త్రిగారు.

"ఈ ముప్పై ఏళ్ళలోనూ మీ బోధనలు విని, ఎవరైనా మంచివేవు మళ్ళేరా స్వామీ?" అన్నాడు అమాయకుడు.

శాస్త్రిగారు తుళ్ళిపడ్డారు. ఈ ముప్పైఏళ్లలోనూ, ఆయన్ని ఎవ్వరూ ఎన్నడూ అటువంటి ప్రశ్న అడగలేదు. అమాయకుడి ముఖంలోకి సూటిగా చూసేరు. ఆముఖం చూసేక మాత్రం ఆయనకి, ఎందుకో 'నిజం' చెప్పెయ్యాలనిపించింది.

"వెర్రివాడా! అది అంత సులభమనుకున్నావా? మంచిమాటలు వినగానే మారిపోడానికి, వాళ్లు వెర్రివాళ్ళనుకున్నావా! వాళ్ళకీతెలుసు నాయనా! తెల్లారి లేచింది మొదలు వాళ్లు చేసేవన్నీ పాపప్పనులేనని .. అందుకే, చీకటిపడ్డాక ఇక్కడికి వచ్చి, పురాణం విని, నాపళ్ళెంలో నాలుగుడబ్బులు పడేసి– ఆ రోజుపాపాలు ఆ రోజుకి కడిగేసుకొని పుణ్యం మూటగట్టుకోవాలని చూస్తారు వీళ్లు తెల్లారి లేచేక మళ్ళీ మామూలే!" అన్నారు శాస్త్రులవారు.

"అయితే, స్వామీ! పురాణం విని పుణ్యం సంపాదించినా, వీళ్లమళ్ళీ పాపప్పనులే ఎందుకు చేస్తూంటారు?" అన్నాడు అమాయకుడు అమాయకంగా.

శాస్త్రులవారు చిరునవ్వు నవ్వి. "చూడబోతే నువ్వు అమాయకుడిలావున్నావే! పురాణ శ్రవణంతోనే పాపపంకిలం ఒదిలిపోతే, ఇంకేంకావాలి నాయనా? భూలోకమే స్వర్గమైపోదా! పుణ్యం అన్నది స్వయంగా ఆర్జించుకోవల్సిందే!" అన్నారు.

అమాయకుడికి ఈ తర్కం నచ్చలేదు. శాస్త్రిగారితో చాలాసేపు వాదించేడు. వాదించి వాదించి, చివరికి తన గురువుగారి కడసారి కోరికనీ, తన అంతిమ ఆశయాన్నీ శాస్త్రిగారికి చెప్పి, మనుషుల్ని మంచివేపు మళ్ళించడానికి పురాణాన్ని మించిన మరో మంచిమార్గం చెప్పమన్నాడు.

అంతే!

శాస్త్రిగారు, హఠాత్తుగా పళ్లెంలోని సరుకుల్ని సంచీలోవేసుకొంటూ— "నువ్వు విద్యానిధి శిష్యుడివా, బాబూ!.... నీమాటా, నీ గురువుగారిమాటా వింటే, మాకు మళ్ళీ వచ్చి మంచినీళ్లు పుట్టవు. మావంశం తరతరాల్నించి, ఈ కన్యకాపరమేశ్వరీ ఆలయంలోనే పురాణం చెప్పుకొని బతుకుతోంది. వాళ్ళకి వ్యతిరేకంగా ఒక్కముక్క చెప్తే, మర్నాడే మనకు వుద్వాసన తప్పదు. ....వస్తాను బాబూ!" అంటూ శాస్త్రిల వారు వడివడిగా గడబిడగా వెళ్ళిపోయేరు.

అమాయకుడు, ఆ ఆలయప్రాంగణంలోనే, ఆలా చతికిలబడిపోయేడు.

ఆరాత్రి, ఆ చలిలోనే ముడుచుక్కూచుని, అతను అతితీవ్రంగా ఆలోచించేడు.

మర్నాడు తెల్లవారుతూనే, నగరంలోని ప్రముఖ వడ్డీవ్యాపారస్థుడి ఇంటికి వెళ్లేడు అమాయకుడు.

ఆ వడ్డీవ్యాపారికి పాతికేళ్ళ కిందట, ఒకేఒక పెంకుటిల్లు వుండేదిట. ఇప్పుడు. అటువంటి పెంకుటిళ్లు పాతికదాకా ఆయన స్వాధీనంలో వుండడమే కాకుండా, తను వుండడానికి ఒకపెద్ద భవంతికూడా వుంది. ఆ భవంతికే వెళ్ళేడు అమాయకుడు.

ఆ వ్యాపారి మహాదైవభక్తుడు. అందుచేత, ఒకజాము పొద్దెక్కేవరకూ పూజా మందిరం వదిలి బైటికిరాలేదు. ఆ తరవాత వచ్చి, కుశల ప్రశ్నలువేసి, వచ్చిన పనేమిటని అమాయకుణ్ణి అడిగేడు.

చల్లకొచ్చి ముంతదాచడ మెందుకని, 'ఈ వడ్డీవ్యాపారం ఎన్నాళ్లనించి చేస్తున్నా' రని అడిగేడు అమాయకుడు.

ఆదినుంచీ తమ కులవృత్తి ఇదే అన్నాడు వ్యాపారి.

ఈ వ్యాపారంలో ఇప్పటికి ఎంతగడించి వుంటారన్నాడు అమాయకుడు.

వడ్డీవ్యాపారి ఒక్కక్షణం చెప్పాలా వద్దా అన్న మీమాంసలో పడ్డాడు. ఆఖరికి, 'ఏదో తమపెద్దల దయవల్లా, భగవత్కృపవల్లా ఒకలక్ష వరాహాల్దాకా సంపాదించే నన్నాడు.

అమాయకుడు ఒక్క నిమిషం ఆలోచించి హఠాత్తుగా, —"ఈ వ్యాపారం ఇంతటితో మానెయ్యకూడదా?" అని అడిగేడు.

'నీ ప్రాణాలు నాకు ఇచ్చెయ్యకూడదా?' అన్నట్టు బెదిరిపోయేడు వ్యాపారి.

"ఏం, ఎందుకు స్వామీ?" అన్నాడు కొంచెం తెప్పరిల్లి.

"ఓ వ్యాపారీ! నువ్వు ఇప్పటికి నీకేకాకుండా, నీముందుతరాలకక్కూడా సరిపడి నంత కూడవేసేవు. కాని, నీదగ్గిర వడ్డీలకి అప్పులు పుచ్చుకొన్నవాళ్లు మాత్రిం ఆ అప్పులు తీర్చలేక, అల్లాడిపోతున్నారు. నువ్వు నీ పిల్లలకి ఆస్తులిస్తూవుంటే, వాళ్లు వాళ్లపిల్లలకి అప్పుపత్రాలు ఇస్తున్నారు.... పేదవాళ్లని ప్రేమించు నాయనా! వాళ్ళ ఎడల మంచిగా వుండు.... భగవంతుడు నీకు మేలుచేస్తాడు...." అంటూ మెత్తగా చెప్పేడు అమాయకుడు.

అంతావిని, "నేనుమాత్రం కసాయివాణ్ణనుకున్నారా స్వామీ? మా తండ్రిగారి ఆబ్దికంనాడు పేదలకి అన్నదాన వస్త్రదానాలు చేస్తున్నానే! విఘ్నేశ్వరుడికి వుండ్రాళ్లు పోయిస్తున్నాను; ఆంజనేయస్వామికి కొబ్బరికాయలు కొట్టిస్తున్నాను; శ్రీరామచంద్రి మూర్తికి ఏటా కళ్యాణాలు చేయిస్తున్నాను; వెంకట్రమణమూర్తికి నేతి దీపారాధనలు చేయిస్తున్నాను; పరమశివుడికి సరేసరి, అభిషేకాలు చేయిస్తున్నాను.... ఇవన్నీ నేను నాస్తికుణ్ణయి చేస్తున్నానా స్వామీ?!" అన్నాడు వడ్డీవ్యాపారి.

"నిజమే నాయనా! నువ్వు సత్పురుషుడి వవడంవల్లె ఇవన్నీ చేస్తున్నావు. కాదనను. కాని పేదవాళ్ళని ఒక్కసారిచూడు. ఋణభారాల్తో ఎలా కుంగిపోతున్నారో, ఈ వ్యాపారం ఇంకమాని, నీ ధనంతో పేదలకి సాయంచెయ్యి నాయనా!" అన్నాడు అమాయకుడు బతిమాలుతున్నట్టు.

వడ్డీవ్యాపారి అంతా విన్నాడు. విన్నాక, మాంసాహారం మానమని చెప్పిన పసిపిల్లవేపు చూసిన పెద్దపులిలా చూసేడతను. అమాయకుడు ఈపులి చూపుల్ని గమనించక, తన మామూలు ధోరణిలోనే, ఇంకా ఏదో నచ్చజెప్పబోయేడు.

ఇంతలో— ఆ వడ్డీవ్యాపారి టక్కునలేచి నిల్చుని, "స్వామీ! ఇకమీరు దయ చేయండి. ఇన్నేళ్లగా నేను చేసుకుంటున్న ఈ వ్యాపారం, ఎప్పుడో ఒకరోజున పేద వాళ్లకి పంచిపెట్టడంకోసం కాదు... అయినా, కందకిలేని దురద మీకెందుకు? నా డబ్బుతో అవసరంవున్నవాళ్లు, నేనుచెప్పిన వడ్డీకి ఒప్పుకొని సొమ్ముతీసుకుంటున్నారు. తరవాత తీర్చగలిగితే, తీరుస్తారు. లేకపోతే, ఆ చికాకులేవో మేము చూసుకుంటాం. మీకవసరమైన విషయాల్లోకి దిగకండి.... వెళ్ళండి" అంటూ ఇంట్లోకి వెళ్లిపోయేడు.

మండుటెండలో, మళ్ళీ వీధిలోపడ్డాడు అమాయకుడు. వడ్డీవ్యాపారి తననింతలా అవమానిస్తాడని అతను వూహించలేకపోయేడు. ఒక్క క్షణకాలం, చెప్పలేనంత నిరాశ అతన్ని ఆవహించింది.

కాని, వెంటనే గురువుగారికి చేసిన వాగ్దానం గుర్తుకొచ్చిందతనికి.... ఎన్ని కష్టాలు ఎదురైనా, మంచిని సాధించితీరాలి. మనుషుల్ని మంచివాళ్లగా మార్చాలి. ఈ వ్యాపారి మారకపోతే, పోనీ మరొకవ్యాపారి మారడా? మనసు మార్చుకోడా?— అనుకొని మళ్ళీ బయలుదేరేడు.

ఈ నమ్మకంతోనే, ఎండనక వాననక పుణ్యభూమిలోని ప్రతి వూరూ, పల్లే, గ్రామం— కాలినడక తిరిగి తిరిగి, పొలమూ పుట్రా, గొడ్డూగోదా పుష్కలంగా సంపాదించిన పెద్దలందరి దగ్గిరికీ వెళ్ళేడు

వారంతా, మొదట్లో ఇతను ముష్టికోసం వచ్చేడనుకొని, ఏదో ఇచ్చి పంపబోయేరు.

కాని ఇతను మళ్ళీవెళ్లి, 'మంచిగా వుండ'మనీ, 'పేదల్ని ప్రేమించమ'నీ చెప్తే, 'సరే, అలాగేలే' అన్నారు.... అన్నారేకాని, వారి పద్ధతులేవీ వారు మార్చుకోలేదు. మళ్ళీ నచ్చచెప్పడానికీ, బతిమాలడానికీ అమాయకుడు వెళ్తే, ఈసారి కసిరిపంపేసేరు.

అమాయకుడు గట్టిదెబ్బ తిన్నాడు!

'మరి, మంచిని సాధించలేనేమో? ... గురువుగారి కోరిక నెరవేర్చలేనేమో?!' అనుకొంటూ, వెర్రివాడిలా వీధుల్లో తిరగడం మొదలెట్టేడు.

ఇలా తిరుగుతూవుండగా చూసి, రాజుగారి కొలువులోని ప్రముఖవేదాంతి ఒకడు అమాయకుణ్ణి రమ్మని కబురంపేడు. అమాయకుడు, ఆ రాజవేదాంతి దగ్గిరికివెళ్ళేడు.

"ఏమిటి నీబాధ?" అన్నాడు వేదాంతి.

తనబాధా, తన గురువుగారి బోధా— అన్నీ వివరించి చెప్పేడు అమాయకుడు. తన ఎడల పుణ్యభూమిలోని పెద్దల ప్రవర్తనకూడా ఆ వేదాంతికి వివరించేడు.

ఆ వేదాంతి అదంతావిని, వేదాంతపు నవ్వొకటి నవ్వి, "నాయనా! ఈలోకం మిథ్య. ఇందులో నువ్వు మిథ్య; నేను మిథ్య. ఆ పాపాలు చేస్తున్నవాళ్ళంటావా? ...

వాళ్ళు మిథ్యే! అసలుపాపమే ఒక పెద్ద మిథ్య. నేనొకమాట చెప్తాను విను. మనం మంచిగావుంటే, ఈ ప్రపంచం మనకంటికి మంచిగానే కనిపిస్తుంది. ఒక్కసారిచూడు- మానవులకోసం మానవుడు ఎంతటి రమ్యమైన లోకాన్ని సృష్టించేడో! ఈ మంచిని చూడ్డం అలవర్చుకో... చెడ్డనే అలా చూస్తూవుంటే, కొన్నాళ్లకి నువ్వూ దుర్మార్గుడివిగా తయారవుతావు. వెంటనే, నీలో హింసాప్రవృత్తి ప్రబలుతుంది. హింస మనకెవ్వరికీ మంచిదికాదు కదా! అంచేత, చెడుని మాటాడకు. అలాగయితే, నువ్వు సుఖంగా వుంటావు; కడంవాళ్ళని సుఖంగా వుండనిస్తావు" అని అతి సులువుగా, అరిటిపండు వలిచి చేతిలో పెట్టినట్టు చెప్పేడు.

అమాయకుడికి ఈ మాటలు నిజమనిపించేయి. ఈ 'నగ్నసత్యాన్ని' ఇన్నాళ్ళూ తెలుసుకోలేక పోయినందుకు విచారించేడు కూడాను.

"ధన్యుణ్ణి స్వామీ! మీ సలహా పాటిస్తాను" అని వెళ్ళిపోయేక.

కొన్నాళ్ళపాటు, ఈ సిద్ధాంతం బాగున్నట్టే అనిపించిం దతనికి. కాని, రోజులు గడుస్తూన్నకొద్దీ అతనికి మరొక కఠోరసత్యం అర్థమయింది. తను చూసినా, చూడక పోయినా- పేదవాళ్ళు చెమటోడ్చి పండించినదాన్ని, పెద్దవాళ్ల పంచుకుంటూవుండడం నిజం! తను కళ్లుమూసుకొని వున్నా, తెరిచేవున్నా— తిండికోసం చేసిన అప్పులు తీర్చలేక, బతుకులకి బతుకులే వడ్డీలుగా, వడ్డీలకి వడ్డీలుగా, వ్యాపారస్థుల గుప్పిళ్లలో ఇరుక్కుపోతూవుండడం సత్యం!! తను చెవులుమూసుకున్నా, మూసుకోకపోయినా- పుణ్యభూమి అంతటా అన్యాయానికి వాతబడ్డవాళ్ల రోదిస్తూనేవున్నారన్నది వాస్తవం!!

ఆలోచించగా ఆలోచించగా, మంచిని పెంచడానికి కాక, చెడునికూడా మంచిగానే చూపించడానికి మాత్రమే ఈ రాజవేదాంతం పనికొస్తుందని అమాయకుడికి రూఢిగా తెలిసిపోయింది.

దాంతో మళ్ళీ మొదలు!

ఈసారి మరీ పిచ్చిపట్టినట్టు తిరిగేడు అమాయకుడు.

ఇలా వుంటూవుండగా—

ఒకరోజు తెల్లవారుజామున అతనికి కలలో విద్యానిధులవారు కనిపించేరు. కనిపించి, "నాయనా! నాకోరిక నెరవేర్చడానికి నువ్వు పడుతున్న యాతనలన్నీ

చూస్తూనేవున్నాను. ఆఖరిప్రయత్నంగా ఒకమార్గం నాకు కనిపిస్తోంది. సంగీత సాహిత్యాలకి తలవూపని కఠినాత్ముడుండడు. నాగుబాము కూడా సంగీతానికి తలాడిస్తుంది. అందుచేత, నువ్వు కళాకారులద్వారా మనుషుల్ని మంచివేపు మళ్ళించగలవేమో చూడు" అని చెప్పేరు.

ఏడేళ్ల తరవాత— కలలోనైనా— గురువుగారు కనిపించినందుకు ఉప్పొంగిపోయేడు అమాయకుడు.

గురువుల ఆజ్ఞని అనుసరించి, రాజాస్థానంలోని సంగీతవిద్వాంసుల్ని కలవడానికి వెళ్ళేడు. కాని, ఆ విద్వాంసుల్లో చాలామంది అతనికి దర్శనమే ఇవ్వలేదు. ఒకాయన మాత్రం కనిపించి, అమాయకుడి అభిప్రాయాలన్నీ తెలుసుకొని, వెక్కిరింత నవ్వొకటి నవ్వి— సంగీత సరస్వతిని అవమానించడానికే నువ్వు బయల్దేరేవన్నాడు. ఆ మహోన్నత కళని అల్పులకోసమూ, నీచులకోసమూ వినియోగించడం మహాపాపం అన్నాడు. అలగా జనంకోసం తనతోటివాడు వీణమీటినా, పాటపాడినా ఆవిద్య అంతటితో అంతరించి పోతుందన్నాడు. అలాచేస్తే, సంగీతకళకి మరి అధోగతి తప్పదన్నాడు ... మొత్తంమీద, తను కలిసిరాకపోవడమే కాకుండా, తోటివాళ్ళని రానీకుండా చూస్తానని శపథం చేసేడు.

అమాయకుడు హతాశుడయేడు. అయినా, ఎదురుదెబ్బలు తగులుతున్నకొద్దీ, అతన్లో (మొండి) పట్టుదల పెరిగింది.

'పోనీ, సంగీతంద్వారా కాకపోతే, కవిత్వంద్వారా మనుషుల్ని మారుస్తాను, మంచిని సాధిస్తాను'— అనుకొని, రాజాస్థానంలోని కవుల్నికలిసేడు.

ఆ కవుల్లో కొందరు, ఆ సంగీత సార్వభౌముల్లాగే, "కళంకం; అపవిత్రం" అని తప్పించుకొంటే; మరి కొందరు— "పేద ప్రజలకోసం కవిత్వం రాయడమంటే, ప్రభువులకి వ్యతిరేకంగానే కదా? అది రాజద్రోహం కాదా?" అని ఎదురు ప్రశ్నలు వేసేరు. మరి కొందరు కవులయితే,— "కవయాః నిరంకుశః — అన్న సూక్తి నీకు తెలీదా?''మాకు, 'ఫలానాదిరాయి' అని చెప్పడానికి నువ్వెవరు? అలా చెప్పించుకొంటే, మా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పోవా?" అని అడిగేరు. ఒక కవికులతిలకుడు, అమాయకుడి గోడంతా విని, "మన పుణ్యభూమిలోవున్న ధనవంతులే బహు తక్కువమంది. పూర్వజన్మ పుణ్యంవల్ల వాళ్ల ఆమాత్రంగానైనా వుంటున్నారు. ఆ బహుకొద్దిమంది మీదా అసూయతో కవిత్వం రాయడం దేశద్రోహం కాదా?" అన్నాడు.

ఆఖరికి రాజకవులుకూడా అమాయకుడిని దావుదెబ్బకొాట్టేరు.

అమాయకుడికి కొత్త ఆలోచన తట్టింది. 'వాళ్ళనీ వీళ్లనీ బతిమాలుకోవడం కన్న నేనే ఒక కావ్యం రాస్తాను' అనుకొన్నాడు. కొన్నాళ్ళపాటు సాధనచేసి, ఆఖరికి ఒక కావ్యం రాసేడు.

అందులో పద్యాలన్నీ కరుణరసాత్మకమైనవే। పేదల అగచాట్లని హృదయ విదారకంగా వర్ణించేవే।

అలాంటి కావ్యాన్ని తీసుకొని అమాయకుడు- వడ్డీవ్యాపారుల దగ్గిరికి, నగరంలోని పెద్దల దగ్గిరికీవెళ్ళి చదివి వినిపించేడు. వారంతా అదివిని, 'శభాష్' అన్నారు. బాగా మెచ్చుకున్నారు. పారితోషికాలు ఇవ్వబోయేరు. ఒక కోటీశ్వరుడు, తనకా కావ్యం అంకితమిస్తే, అక్షరలక్షలిస్తానన్నాడు. గజారోహణం చేయిస్తాం; సన్మానాలు చేయిస్తాం అన్నారు.

అన్నీ అన్నారుగాని, 'పేదల్ని పీడించడం మానేస్తాం' అని మాత్రం అనలేదు.

ఈదెబ్బతో, అమాయకుడు పూర్తిగా డీలాపడిపోయేడు. దిక్కుతోచక గిజ గిజ లాడిపోయేడు.

ఆరాత్రి, పూరవతల చెరువుగట్టున గురువుగారి విగ్రహం పాదాలదగ్గర చతికిలబడ్డాడు.

అతనికి కళ్ళలో నీళ్ళు తిరిగేయి ... పదిహేనేళ్ళుగా తను ఇంత శ్రమపడుతున్నా, ఆశించిన దానిలో అణుమాత్రం కూడా సాధించలేకపోయేడు. అంతా అవుననే వాళ్ళేగాని, ఆచరించేవాళ్లు లేరు. కొందరయితే, చెప్పరాని అవమానాలుకూడా చేసి పంపించేరు.... ఇదంతా ఎందుకోసం?— మంచికోసం. ఎవరి మంచికోసం?— బాధలు పడుతున్న వాళ్ళ మంచికోసం ఎవరాబాధలు పడుతున్నవాళ్లు?— పేదవాళ్ళు. వాళ్ళకి మంచిని సాధించడాని కిదిమార్గం కాదా? .. ఎడతెరిపిలేని ఆలోచనలు. అమాయకుడికి తలపగిలిపోతుందేమో ననిపించింది. కళ్ళుమూసుకున్నాడు.

అలా ఎంతసేపు వున్నాడోకాని, ఒక్కసారి వులిక్కిపడి చూసేడు.

ఆ చెరువుగట్టునే— ఒక బక్క ఆవు ప్రాణభయంతో పరుగులు పెడుతోంది. దానివెనకే పరమ భయంకరంగా "భౌ! భౌ!!" మంటూ, కుక్కొకటి పరిగెడుతోంది.

ఏ గడ్డివాముదగ్గిరికో వెళ్ళినట్టుంది ఆ ఆవు. అక్కడ కుక్క అరుపులకే దానికి సగం ప్రాణాలు పోయేయి. మిగతా సగం ఈ పరుగులో పోయేలావున్నాయి. అయినా పరిగెడుతోంది బక్కావు. కుక్క మరీ పుంజాలు తెంపుకొని వెంటాడుతోంది. ఏక్షణాన్నయినా, ఆవుకాలు పట్టుకొనేలావుంది కుక్క.

ఉన్నట్టుండి—

ఆ బక్కావు టక్కున వెనక్కి తిరిగింది. తిరిగీ తిరగడంతోనే బుర్రని బాగా కిందికి దించి, కుక్క డొక్కలో పొడిచింది. రెండు కొమ్ముల్తోనూ కుక్కని పైకెత్తింది.

అమాయకుడు దిగ్గునలేచి నించుని, చుట్టూచూసేడు. పంచమి చంద్రుడు వెన్నెలలు పంచిపెడుతున్నాడు. వెన్నెలలో పాలరాతి విగ్రహాలు వింతగా మెరుస్తున్నాయి చెరువులో నీళ్ల తళతళలాడుతున్నాయి.

దూరంగా ఎత్తుగావున్న నగరం. మినుకు మినుకుమంటున్న దీపాలతో భూతాల దీవిలావుంది.

దిగువని, అక్కడికి దగ్గిరగావున్న కూలిజనాల పాకలకేసి చూసేడు అమాయకుడు. పూరిపాకలన్నీ, ఆవెన్నెల వెలుగులో, తలలు కిందకిదించి, నగరం డొక్కలో పొడవడానికి సిద్ధంగావున్న వింత జంతువుల్లా కనిపించేయతనికి.

వెనక్కి తిరిగిచూడకుండా, చకచకానడుస్తూ నగరానికి దూరంగా సాగిపోయేడు అమాయకుడు.

గంధర్వగానాన్ని బండరాళ్లు కరిగించడానికి ఇంతకాలం వృథాచేసేనే అన్న బాధకన్నా, ఇప్పటికైనా అవి బండరాళ్ళని తెలుసుకున్నందుకు ఆనందంగా వుందతనికి.

* * *

ఆ తరవాత అమాయకుడు ఎవరికీ కనిపించలేదు. వూరు వదిలిపోయేడన్నారు కొందరు. కాదు, మనరాజ్యమే వదిలిపోయేడని మరికొందరన్నారు.

ఈ చల్లనివార్త వూరి పెద్దలందరికీ మలయమారుతంలా తగిలింది.

ఒకటి— రెండు— నాలుగు— ఐదు; ఐదేళ్ళు గడిచేయి. కాని, అమాయకుడి జాడ తెలియలేదు. అతను మరణించేడేమోనన్న ఆశాభావం వెలిబుచ్చేరు కొందరు.

అతను నిజంగా మరణిస్తే, అతనికూడా ఓ పాలరాతి విగ్రహాన్ని చేయించాలని ఒకాయన అన్నాడు. అయితే, అమాయకుడి 'నిర్యాణం' రూఢిగా తెలియకపోవడంవల్ల విగ్రహస్థాపన జరగలేదు.

ఈ నాలుగైదేళ్ళయి—

వడ్డీ వ్యాపారం వెనకటికన్నా సజావుగా సాగుతోంది.

రైతులకష్టాన్ని, భూస్వాములు పూర్వంకన్నా ఎక్కువగానే అనుభవిస్తున్నారు.

పురాణం శాస్త్రిలూ, కవులూ, సంగీత విద్వాంసులూ పూర్వంకన్న ఎక్కువగానే రాజస్తోత్రాలు చేస్తూ, ఎప్పటిలాగే పారితోషికాలు పొందుతున్నారు.

పెద్దలంతా ఇలా హాయిగా వుంటూవుండగా— హఠాత్తుగా పుణ్యభూమిలో "పాపచింతన" పొడసూపింది.

పండిన పంటంతా, పండించినవాడిదేనని, ''న్యాయంగా'' కామందుల కివ్వవలసిన భాగాన్ని ఇవ్వడం మానేసేరు— రైతులు. వడ్డీలకి అప్పులు పుచ్చుకొన్నవాళ్లు, అసలు సంగతి దేవుడెరుగును; వడ్డీలుకూడా ఇవ్వం పొమ్మన్నారు. అణగిమణగివుండే జనంవంతా ఇలా రేగిపోడం ప్రారంభించేరు.

వణిక్ప్రముఖులు, వాణిజ్యవేత్తలు, వడ్డీవ్యాపారులు, కామందులు, కోటీశ్వరులు—అంతా ఈ విపరీత పరిస్థితికి హడలిపోతున్నారు. ఏం చెయ్యడానికీ వారికి దిక్కుతోచడంలేదు. అక్కడికీ, చేతిలోవున్న నౌకర్లనీ, చాకర్లనీ కత్తులిచ్చి జనంమీదికి పంపించేరు. వాళ్లైనా, అనుమానం వున్నవాడి గుండెల్లో కత్తులైతే దించగలిగేరు కాని, చెలరేగిన జనాన్ని ఆపలేకపోయేరు.... ఎక్కడ విన్నా అమాయకుడిపేరే! మనిషి మాత్రం దొరకడు!

పెద్దలందరికీ వ్యవహారం తమచెయ్యి దాటిపోయిందని తెలిసిపోయింది. మొర పెట్టుకుందికి మహారాజు దగ్గిరికివేళ్లేరు;

''భగవద్దత్తమైన తమ రాజ్యాధికారాన్ని కూలదోయడానికిది ప్రయత్నం కాదా, ప్రభూ?''

''వేల వరహాల అప్పుపత్రాల్ని నాకళ్ళముందే భోగిమంటలు వేసుకున్నారు. దంద్రుణ్ణి, ఇక తమరే కరుణించాలి మహరాజా!''

"నీటిలోని చేపనైనా పట్టుకోగలం కాని, ఈ అమాయకుడు మాత్రం అంతు చిక్కడం లేదు: అతనిమీద రాజద్రోహ నేరంమోపి, అతని శిరస్సుకి మంచి బహుమానం ప్రకటించండి ప్రభూ!"

"పల్లెపట్టుల్లో రాజుకుంటున్న ఈ నిప్పురవ్వలు మన నగరాలని రగిలిస్తాయి: మనం ముందే జాగ్రత్త వహించాలి స్వామీ!"

"ఈ అమాయకుడు ఎవరో కాదు మహరాజా! ఆనాడు తమరు సింహాసనాన్ని అధిరోహించడానికి కారకుడైన విద్యానిధి శిష్యుడు. చచ్చిపోయేడనుకున్నాం. ఇప్పుడిలా తయారయేడు. సంఘవిద్రోహ శక్తుల్ని మొగ్గలోనే తుంచెయ్యాలి ప్రభూ!"

"తమర్ని మహారాజుగా గుర్తించడం మాని, వాళ్ళ రాజ్యాన్ని వాళ్ళే పాలించుకుంటారట మహారాజా!"

"ప్రభువులు చెప్పిన మంచినికాదని, ప్రజల మంచిని సాధిస్తామని బయలుదేరిన వాళ్ళని సరికెయ్యడానికి ఆనాడు సింహపురి ప్రభువులకి మనం సైనికసహాయం చేసేము కదా! ఈనాడు, ఈ ఆపత్సమయంలో మనకి వారి అండదండలు కూడా వుంటాయి. తమరు మరి తాత్సారం చెయ్యకండి మహాప్రభూ!"

"శాంతిభద్రతలు కాపాడండి! మా ఆస్తికీ, ప్రాణాలకి రక్షణ కల్పించండి!! ధర్మం నిలబెట్టండి!!!"

—అంటూ అలనాడు ముక్కూ చెవులూ తెగిపోయిన శూర్పణఖ, రావణుడి దగ్గిర గోలపెట్టినట్టు మహారాజు దగ్గిర గోలపెట్టేరు పెద్దలంతా.

మహారాజుగారు అంతా శ్రద్ధగావిన్నారు. విన్నాక దీర్ఘంగా ఆలోచించేక, దృఢ నిశ్చయంతో సింహాసనంలోంచి పెద్దపులిలా లేచేరు.

ఆయన ఆధీనంలో రథ, గజ, తురగ, పదాతిదళాలు వేలాదిగా వున్నాయి. పేదింటివాళ్ళే అయినా, ప్రభుభక్తి పరాయణులైన సైనికులున్నారు. మారణాయుధాలు మరెన్నోవున్నాయి.

* * *

యతో ధర్మ స్తతో జయః

నగ్నముని ఇటీవలి కవితలు :

## భూస్వా (హా) మి

వాడికి
నగరాలు నమిలేసిన కిళ్లీ ఉమ్ములు
పల్లెలు పళ్ళలో పచ్చిబూతులు
దినమంతా బూతుల్ని భుజిస్తూ
చీకటిపడగానే
కారులో నోట్లకట్టల్తోఉబ్బిన జేబుల్తో
కార్లను వెతుక్కుంటూ
ఉమ్మల్ని తొక్కుకుంటూ
వాడు
ఆకాశంలో ఎర్రనిఎండకీ
నేలపై రాలిపడబోయే వానచినుక్కీ
మొగుడిననుకుంటాడు
నాయకుల కాళ్ళు విరక్కుండా
పదవులు ఊడిపోకుండా
అధికారం కారిపోకుండా
వాడు
నిరంతరం కొజ్జాప్రభుత్వానికి కొమ్ముకాస్తూ
ఉంటాడు.

# మృత్యువు

మృత్యువు పాములా పగబడుతుంది
మనిషికంటికి కనబడనిరూపంలో శ్వాసని
నిరంతరం వెంటాడుతుంది
తల్లి చనుబాలధారలనుండి
మృత్యువు మన ఎముకల్లో పొంచుకుని ఎదుగుతూంటుంది
పాలతోబాటు రక్తంలో కాస్తకాస్త విషాన్నికక్కుతూ
ప్రతిక్షణం కాస్తకాస్త కాజేసి చంపుతుంది
బాల్యమంతా
ఆకలికి ఏడ్వడంనేర్పి
అబద్ధాలాడ్డం నేర్పి
దొంగతనాలు చెయ్యడం నేర్పి
పెద్దమనుషులుగా ప్రతి వెధవపనినీ నేర్పి
సంసారాల్లో
వ్యాపారాల్లో
ఆర్జనల్లో
ఆస్తులు కలుపుకోడాల్లో
గొంతులు పిసికేసే పోటీ నేర్పి
మృత్యువు కాస్తకాస్తగా విషం నింపుతుంది
ఈ కేన్సర్ వ్యవస్థపై తిరగబడకుండా కాస్తకాస్త చంపుతుంది
మృత్యువు పాములా పగబడుతుంది
ధనస్వామ్యం పాములా పగబడుతుంది
ఎదురుతిరిగిన ఆరోగ్యవంతులపై బుసలు కొడుతుంది
కాటెయ్యడానికి తోకపై బుస్సునలేస్తుంది
తోకని పట్టుకుని
జరజరాలాగి గిరగిరా తిప్పి
నేలకేసి కొడితే
తలపగిలి చస్తుంది.

## కవి

గాలినిగురించీ రాయి
గాలినిమాత్రం నీ గీతాల్లో నింపకు
నీటినిగురించీ రాయి
రక్తంలో నీటినిమాత్రం కలపకు
చంద్రుడూ వెన్నెలా నక్షత్రాల్నిగురించీ రాయి
కానీ ఎన్నడూ చీకటీ ఆకలీ లేవనకు
గాలినిగురించి రాయి
గాలి గొప్పవాళ్ళకోసమే వీస్తుందని రాయి
గుడిసెల్ని తగులబెట్టడానికే వీస్తుందని రాయి
నీటిని గురించీ జలకాలాటల్నిగురించీ రాయి
కన్నీళ్ళే మేఘాలనిమాత్రం రాయి
చంద్రుడూ వెన్నెలా నక్షత్రాలూ
పొట్టలు నిండినవాళ్ళు డ్యూయెట్లు పాడుకోడానికే
విరగబూస్తాయని రాయి.

## అహింస

దవడమీద చాచి కొట్టినప్పుడు
పళ్ళూడిపడాలి
మోకాళ్ళతో ఢీకొన్నప్పుడు
తొడలిరగాలి
పిడికిళ్ళు తాకితే
బుజాలు ఒరగాలి
పొట్టల్లో కసుక్కున కత్తులు దింపితే
పేగులు బయటకురావాలి
శతాబ్దాలుగా కన్నీళ్ళతో తడిసిన నేల నేలంతా

రక్తం చిమ్మాలి
దణ్ణంపెడితే చెరుకు రసాన్నివ్వదు
దణ్ణంపెడితే విషసర్పాలు కరవకమానవు
ఈ నాయకుల్నీ నానారకాల వ్యాపారుల్నీ
ఈ భూస్వాముల్నీ వడ్డీబొజ్జలవాళ్ళనీ తోలు బిజినెసుల్నీ
బలహీనుల రక్తమాంసాలు తాగుతున్న
ఈ రాక్షసుల్ని క్షమించి
పురాణాలు వింటూ నిద్రపోతే
ఆర్థిక అసమానత్వం తొలగదు
ఈ దోపిడీ వ్యవస్థ మారదు
దవడమీద చాచి కొట్టినప్పుడు
పళ్లూడిపడాలి.

## ఇక్కడ

ఇక్కడ
ఊపిరి పీలుస్తాను
ఇప్పుడు భయం కెరటాలు మీటకు
ఈ ప్రజా జీవితపు నాగేటిచాళ్లలో
నా కళ్లు చల్లుతాను
దేవుణ్ణీ వాడి ఏజెంట్లనీ పంపి అజ్ఞానపు కలుపుపెంచకు
ఈ నేలలో బందూకులు మొలవనీ
తిరగబడే గుండెలు గుత్తులుగుత్తులుగా బయటపడనీ
ఈ వ్యవస్థని కూల్చే మనుషులు
కోటానుకోట్లు ఎర్రగా నేలచీలి రానీ
వాళ్ళకోసం
వాళ్ళ వాళ్ళకోసం
ఇక్కడ భగ్గున గాలిగాలంతా విప్లవాలు మండుతాను
ఇప్పుడు భయం కెరటాలు మీటకు.

## అశ్లీలం

పైన
తళతళా కోరలు
ఆకాశం చర్మంలో కసుక్కునదిగి నిక్కిచూస్తున్న కోరలు
లోకమంతాచీకటి కారుతున్న రక్తం
కింద
మట్టిలో పూలూ పురుగులూ
ఆకలి

పొట్టలో దిగిన ఒక కోర
అక్కడొక పువ్వు
పేవ్‌మెంటుమీద పేడలో పూసినపువ్వు
చెదలుతినేసిన రేకలు
ఎముకల ప్రపంచంపొట్టలో పేగులఅరుపులు కాసేపు ఆగినప్పుడు
ఎదుగుతున్న ఆడపిల్ల అర్ధరాత్రి
పేవ్‌మెంటుపక్కనే ఒక పురుగు
దుమ్ములో ఉమ్ములో పేడపురుగు
అడుక్కోడం దాని బతుకు
రెక్కలుతెగ్గొట్టబడి మొండిగా పాకేపురుగు
బారుల్లో గ్లాసుల్లో పర్సులమీసాలు కాలిపోయిన అనంతరం
షాపులు బట్టలిప్పేసుకుని నిద్రపోయినక్షణం
గజ్జిపట్టిన పురుగు
చెదలు తినేసిన పువ్వు
అటూయిటూ రిషాలూ టాక్సీలూ కునికిపాట్లు
పిట్టగూళ్లలో గోడలకతుక్కున్న మధ్యతరగతి బల్లులు
నగరశ్వాసకి ఎగిరిపడుతున్న చన్మొనలు మేడలు
మొండిమొలల గదులు
గదుల్లో వేలాడుతున్న పాములు చీరలూ జాకెట్లూబ్రాసరీలు

లాడ్జిపొట్టలో అలిసిన పేగుల అరుపులు ఆపిన చప్పుడు
అర్ధరాత్రిచర్మంలో రెండో ఆకలికోర
వెల్లకిలా పడుకున్న నగరం అవయవాలమధ్య
అశ్లీలాన్ని అన్యాయాన్ని అరికట్టడానికి
అటూయిటూ తిరుగుతున్న బీటుపోలీసు
పేవ్‌మెంట్ పంటి పాచిమీద
ఒక చెదలపువ్వూ గజ్జిపురుగూ
ఇద్దరూ అడుక్కుతినే ఆడదీ మొగాడూ
ఒకరిమీద ఒకరుపడుకుని న్యూసెన్సు చేస్తున్నారని
లాఠీతో బాదబాది మొండిమొలల్తో రోడ్డంతా పరిగెత్తించి
బిగ్గరగా యీలేసి నవ్వుకున్నాడు

మరుక్షణం
పదునైన బాకులా ఒక పొడుగాటి ఖరీదైన కారు
లోపల ఒళ్ళుమీద పంచెలేకుండా చీరలేకుండా
పక్కనుంచి దూసుకుపోతే
బూట్లు టక్‌మని దగ్గరకుకొట్టి శాల్యూట్ చేశాడు.

## పొద్దు తిరుగుడు పువ్వు

రాక్షసులు ప్రజల అవయవాల్ని
వాగ్దానాలకత్తుల్తో ముక్కలు ముక్కలుగా నరికి
ఎలక్షన నెగళ్ళలో చురచురా కాల్చుకుని
కరకరా పదవుల కోరల్తో నమిలి తింటున్నప్పుడు

కొరివిదెయ్యాలు కాషాయగుడ్డల్తో
జనం అజ్ఞాన నరాలపై చిందులు తొక్కుతున్నప్పుడు
పార్టీలు మార్చే తోలు వ్యాపారాలవాళ్లూ
ఇసకబ్రిడ్జీలుకట్టి బ్యాంకుల్లో పొట్టలు పెంచినవాళ్లూ
టోకున దేశానికి ఎంగిలాకులమ్మే ఆహారశాఖామాత్యులూ
ప్రజల అవయవాలమీద కెగబడినప్పుడు

జీవితంలో ఓడిపోయి కుమ్ములాటలో కాళ్లుతెగిపోయిన
లేళ్లా లేగదూడలూ
నోళ్లు తెరిచిన నగరాలపొగల బోర్తల్‌హౌసెస్‌లో
మెతుకుల్ని వెతుక్కుంటున్నప్పుడు

కొండల్లో
కోనల్లో
చిక్కని చీకట్ల కారడవుల్లో
ఆశయాల కాంతిరేకల్తో
కొన్ని పొద్దుతిరుగుడుపూలు
కణకణా మండుతున్నాయి.

## సముద్రం

సిగ్గులేని సాయంత్రం
పైన టి.బి. పేషెంటు రక్తంకక్కుకుంటున్నసమయం
మనం త్వరత్వరగా ఇంటిని చేరుకుందామని నడుస్తాం
పాదాలకీ రక్తమే
అప్పులమేకులూ అవమానాలముళ్లూ గుచ్చుకున్నరక్తం
సముద్రంలోంచి కెరటాలు పారిపోడానికి ప్రయత్నించినట్లు
ఆరోగ్యంకోసం త్వరత్వరగా కేన్సర్‌ని గొంతులోదాసుకుని దారిని నడుస్తాం
పేషెంటుకి ఆపరేషన్ జరుగుతుంది
పొట్టచిరిగి చీకటి కారుతుంది
అంతా చిమ్మచీకటికంపు
అడివిలో దొంగలు కాగడాలకి బదులు నియోన్‌లైట్లు వెలిగించుకుంటారు
జంతువులకిబదులు మనుషుల్నికాల్చుకుని ఫోర్కులతో సుతారంగాతింటారు
ఆసుపత్రి మూలుగులనుంచి

అడవిదెయ్యపు చెట్లనుంచి ఇంటికి పోదామని
తొడలమధ్య రహస్యలోయల్లోంచి
నాలుకలతో పెదాలతో కోర్కెలఅంగాంగాలతో నడుస్తాం
చెవుల్లో పెనవేసుకుంటున్న గుసగుసల తీగలపందిరి
బాధ్యతల నిట్టూర్పుల్ని బంధిస్తుంది
పెదాలమీద ఆడతీపి ఆవిరై
సుఖరోగాల బాకులు దారిదారంతా మెరుస్తుంటే
బాజాభజంత్రీల్నీ బంధువర్గాన్నీ
సన్నాయినీ మంగళసూత్రాన్నీ తొక్కుకుంటూ
ఇంటికి చేరుకుందామని త్వరత్వరగా నడుస్తాం
సిగరెట్ల గుట్టలమధ్య ఆవేశాలపొగలమధ్య
ఏమేమిటో మాట్లాడతాం మైళ్ళకుమైళ్ళు
మధ్యమధ్య నవ్వుతాం రోషపడతాం దుఃఖపడతాం చర్మపుముడతలుగా
ఇంతలో ఉలిక్కిపడి దారి తెలిసినట్లు నటించి
పెళ్లాంచర్మంలోంచి పిల్లల రక్తంలోకి దూరి
పోగొట్టుకున్న బాల్యంతో క్రికెట్ ఆడతాం
మళ్లీ ఇల్లుగుర్తుకొచ్చి
దారిని వెడల్పుచేసి, ముళ్లూ రాళ్లూ విసిరేసి
చీకటినిచీల్చి, అరణ్యాన్ని అడ్డంగానరికి
ఉద్రేక కెరటాల్తో జనసముద్రంలో కలిసి పొంగిపొర్లి
ఇంటినిచేరుకుని
తలుపు తట్టినప్పుడు
తలుపులు తెరుచుకుని భౌభౌ, మని పోలీసుకుక్కలు బయటికిదూకి
'నువ్వు విప్లవాలు పీస్తున్నావ్'అంటూ చేతులకు బేడీలువేస్తాయి
రాత్రిరాత్రంతా గొంతు తెగిన వాన్లూ కుక్కల భౌభౌలూ

సముద్రం తెగుతుంది
సమస్తాన్నీ తెంపుతుంది
హోరుమని ఉదయంగా మారుతుంది.

కిషన్ కవితలు రెండు :

## చలి ఉత్త కాగితం పులి

ప్రశాంత జీవితంలోకి ప్రభంజనం హోరులా
చల్లకదలని కడుపులకి ప్రజాసైన్యం బారులా
కమ్మని నిద్రమత్తులోకి ప్రభాత భేరీలా—
ఎందుకీ ఆర్భాటాలు ? ఎందుకీ పోరాటాలు... అనకు !
నాలుగు పూటల పస్తుపిదప ఛటాకు మెతుకులా బతుకు,
ఏడాదిలో ఏ అర్నెల్లకొకసారో మనసారా నవ్వడమా బతుకు
చీకటికీ నీడల్లో, జ్వరంతో, భయంతో, కౌగిలింతా జీవితం?
—ఎక్కడికో ఇంకెక్కడికో ఎదగాలనే ఉత్ప్రేరణ!
భరత పక్షిలా
దవానలంలా
కొండలు దిగే సెలయేరులా
కాకలుతీసిన లోహంలా
త్రాచులా
మృదంగ నాదంలా
గాలంలా ఆడడం
నురుసులా ఉప్పొంగడం.
ఆకలంటే ఆరోగ్యమనీ
శ్రమంటే కమ్మని నిద్రనీ, అనడం.
అనుక్షణం ప్రగతివేపు పరుగెత్తడం.
ఇదీ జీవితం—
అవరోధాలకు అలిసిపోయి ఎముకలులేని జీవిలా కూలిపోవడం
సాహసం 'పాపకార్యమంటే' పనితప్పింది లెమ్మని పూరెమ్మలా
రాలిపోవడం!

కానేకాదు జీవితం...
ఇప్పటి ఈ స్తబ్దతపేరు ప్రశాంతత అనకు...
[1] కుక్క మూతినాకుతోంది- కసిరికొట్టి కాస్తాసాయం చేయమనకు!
[2] డైనోసార్ల సోమరితనంతో నాశనం చేజేతులా కోరకు
ఈ చలికి ఊహాభీతి దుప్పటి బిగించి
కుక్కిమంచం చింగుల్లో ముడుచుకోకు
అరచేతి మందాన వమనమైన సంఘం కుళ్ళుతో
నల్లగా డ్రైనేజీపాకుడులా ఎలాఉందో చూడాదుప్పటి!
పొదలోని కొదమసింగంలా లేచి,
వేకువకాంతుల సమ్మేళనం వేపు,—
—మంగళధ్వనులతో ప్రవహిస్తోంది. ఈ విప్లవవాహిని
నీవూ దుముకు, ఈచలి ఉత్తకాగితం పులి!
ఈ అమృతజలాల్లో దూకావో, రాదిక నీజోలికి అది.

---

1 ఇద్దరు పేరుప్రఖ్యాతులున్న సోమరులు ఓ రేగుచెట్టుకింద వెలికిలా పడుకుని విశ్రాంతి తీసుకుంటున్నారు. రేగుపండొకటిరాలి రెండవవాడి రొమ్ముమీద పడ్డుంది. 'అరేయ్.... జర్రి ఈరేగుపండుతీసి నోట్లోవెయ్యిరా' అంటాడు మొదటివానితో. ఈమాట మొదటివానికి కోపం తెప్పిస్తుంది. తనగురించి ఎంత తప్పుడంచనాలో ఉన్నాడూ అనుకుంటాడు 'ఏందేంది? నీకు రేగుపండుతీసి నోట్లోవేసేదా? నాకు కుక్కమూతినాకుతోంటే కసిరికొట్టేంత లేనిగాని....' ఇది మొదటివాని సమాధానం.

2 మంచుయుగానికి పూర్వం జీవించిన సరీసృపాలు ఇవి: అన్నీ మహాకాయులు. మెదడు తక్కువతనంవల్ల సోమరితనంవల్ల తమకి వాటిల్లిన ప్రమాదాల్నిగాని, తమచుట్టూవున్న పరిసరాల్లో జరిగే ప్రాకృతికమార్పుల్నిగాని త్వరగా గ్రహించలేకపోవడంవల్లనే ఈ మహాప్రాణులజాతి నాశనమైందనీ పరిణామవాదం చెబుతూంది!

# విప్లవం పిలుస్తూందిరా...

విప్లవం పిలుస్తూందిరా !
గొంతులో ఆవేశం నింపి
గొంతులో చైతన్యజీవన సంగ్రామ భేరీలునింపి
కత్తిమెరుపు వేగంతో
పిడుగుపాటు శక్తులతో
నిప్పుకణిక వేడిమితో
ఈ చీకటిని, ఈ స్తబ్దతను, ఈ అక్రమ దుష్టవ్యవస్థను—
నిర్దాక్షిణ్యంగా నేలపెట్టి కాలరాయమని,
ఆవరించి ఉన్న కుళ్ళుగోడలూ
ఆవహించి ఉన్న స్వార్థపు చీకట్లూ
తుళ్ళిపడి మనోదండి చెదిరి బెదరగా
కేకేస్తోందిరా ! విప్లవం.

మార్పు నిత్యమనీ
మార్పు సత్యమనీ
పోరాటం సహజగుణమనీ, పోషకపదార్థమనీ,
ఆటంకాలెరగని పరుగు
నీరు పల్లానికి ప్రవహించడం లాంటి సహజగుణం
అనుక్షణం, అవసరమైన పరిణామదశవేపు సాగడమే
విప్లవమనీ,
కేకేస్తూందిరా !

ఇంకా వినబడలేదా—
ఈకేకే, భూమికి పరిభ్రమణం కలిగించింది.

ఈకేకే,
సూర్యగర్భంలోని మిలియన్లడిగ్రీల ఉష్ణానికి ఆయువుపట్టు
ఈకేకే,
విస్తృత విశ్వంలో
గెలాక్సీల కదిలిస్తోంది
నెబ్యులాల సంధానిస్తూంది.
సెకన్‌లోని మిలియన్ వంతునుగూడా అవిశ్రాంతంగా గుర్తించి
పరిశ్రమిస్తూంది
సరికొత్త జగన్నిర్మాణాన్ని కావిస్తూంది.
ఈకేకే
ఇన్నికోట్ల ఈచుక్కల మూకను అదుపులో ఉంచింది
ఉష్ణమై, ప్రాణమై, పరిణామమై
ఈకేకే విశ్వపుటెల్లలదాకా ప్రతిధ్వనులీనుతూంది!

ఇంకా వినలేదా నీవు—!
శూన్యంలోంచి, పదార్థగర్భంలోంచి, సూర్యగోళంలోంచి
గాలిపరుగులోంచి, భూమిలోతుల్లోంచి,
మొలకెత్తుతూన్న విత్తనంలోంచి—
ఎమీబా ప్రాణాపేక్షలోంచి
నీగ్రో, వియత్కాంగ్ గుండెల్లోంచి,
అనుక్షణం నాకు విన్పిస్తూన్న
అనుక్షణం నన్ను కదిలిస్తూన్న—
—ఈకేకలకి మళ్ళీకేకేసి పిలుస్తున్నాను
ఇంకా వినబడలేదా!

కాంతికిరణ వేగంతో
మన ఐకమత్యం వంటి గట్టితనంతో

రా
విప్లవం పిలుస్తోంది!

కదలికనూ, వేడిమినీ, చూపునూ
విటమిన్లనూ అందించి—
మనసు నిత్యజాగృతం చేసే
సూర్యబింబం వంటి చేతనాదీప్తులమీద
వేల యేండ్లుగా ఈ విప్లవ ప్రతీఘాతకులు
వేల యేండ్లుగా ఈమతపు కొండచిలువలు
వేల యేండ్లుగా సమాజయోచనలో గుప్తంగా ప్రవహిస్తున్న
ఈమిధ్యాభావాల శీతల అంతర్ప్రవాహాలు
మన ఉనికిని హిమంలా జడంగా ఉంచాయి
మనగుండెల ధమనుల్ని రోతమెత్తదనపు 'చెడుబలుపు'లో
బిగించి నలిపాయి
మన మెదడుపొరల మధ్య నిలువులోతు గంట్లుపెట్టాయి!
అందుకే ఈ విప్లవం కేకేస్తోందిరా!
మనచుట్టూ దించిన ఉక్కుపలకలు పచ్చికుండల్లా
పగిలిపోతున్నాయ్!
మన నమ్మకాల నల్లమందు మత్తుమింగిన నరాలు
కంపిస్తున్న భూమ్మీది నదీనదాల్లా అల్లల్లాడుతున్నాయ్
పోటెత్తుతున్నాయ్.
భయపడకు- సరిగా అర్థంచేసుకో,
అవమానం, అసహనం, కిరణాలు నిన్నే వెతుకుతున్నాయి
ఆ వెలుగును సమీకరించి చూడు!
లేకితనం, బూటకపుతనం అణువణువుకూ మధ్యన
బూడిదలా పరుచుకొని ఉంది.
గట్టిగా నీ ఆవేశం ఊదిచూడు
విప్లవం ప్రతిచోటా కుశాగ్రంగా ఉంది
విప్లవం ప్రతిచోటా జీవనధ్వనులు విన్పిస్తోంది
విప్లవం తానులేకపోవడమే నిర్జీవమని చెపుతూంది

విప్లవం ప్రతిచోటా నాదంలా, హ్లాదంలా, అందంగా, ఆశగా
ఉత్తేజమై నిండి ఉంది!
గెరిల్లా ట్రిగ్గర్ గుద్దిన తూటాలో విప్లవం!
ఆహారం కావాలంటూన్న ఆకలి సంకేతంలో
విప్లవం!
మెదడు ముడుతల్లో విప్లవం!
పరమాణువు పౌరుషంలో విప్లవం!
వైరస్ మొదలు వేగానక్షత్రందాకా చలిస్తూన్న శక్తిలో విప్లవం!

విప్లవమంటే,
రాచపుండును కత్తులతో కోసి తీసేయడం
కారుచీకట్లో నెగళ్ళు మండించడం!
ఈ ఆహ్వానం అందుకో— ఆయుధంలా కదిలిరా
విప్లవంవలె కదిలిరా.

## నో ఎస్కేప్

నా రా

[ప్రతివాడూ ఎప్పుడో ఒకప్పుడు దొరికిపోతాడు
రానేటప్పుడో- పనిచేసేటప్పుడో,
ఇష్టపడేటప్పుడో- అసహ్యించుకునేటప్పుడో,
ఊఁ అనేటప్పుడో- ఊరుకునేటప్పుడో,
ప్రతివాడూ ఎప్పుడో ఒకప్పుడు దొరికిపోతాడు
కవీ అంతే.]

అభ్యుదయం, ప్రగతీ, విప్లవం
లేకపోతే సోషలిజం, శాంతీ, ఇంకోటీ,
ఏవైతేనేం

తంతానన్నా అని నిలబడ్డవాళ్ళకి వాటి అర్థం తెలుసు
పొగుడుతారని చూసి అనేవాళ్ళకి వొట్టిమాటలు వొచ్చు
అర్థం తెలిసినవాళ్ళు
బలవంతులు
గుణవంతులు
వాళ్ళమాటలే ప్రజలకి పడతాయి
మిగతావా
మట్టిలోకి వెడతాయి.

ఆడదాని లాంటివాడు కవి
అందానికి మురుస్తాడు
పొగడ్తలకి ఉబ్బుతాడు
డబ్బిస్తే దొరుకుతాడు

ఆదిశక్తి లాంటివాడు కవి
దుర్జన శిక్షణకై కరాళ
గర్జనతో చరణమెత్తి
పదపదాన విప్లవాగ్ని
ప్రజ్వరిల్ల జేస్తాడు

వీరనారి, ధర్మపత్ని, షోకులాడి, బోగంది
అంతఃపుర కన్య, వట్టి ఆడపిల్ల, లేడిపిల్ల

ఎవడెలాంటి కవో వాడికలాంటి పాఠకులు మరి.

వ్యక్తి జీవితంలో ఎంత చెయ్యగలదు ఆడది
సమాజ చరిత్రలో అంత చెయ్యగలడు కవి

* * *

ప్రతీ కవీ దొరుకుతాడు
జనానికీ, చరిత్రకీ.

# నా యువతరం

అమ్మంగి వేణుగోపాల్

నా యువతరం
ప్రయోగశాలలో నుంచి ప్రపంచంలోకి వస్తున్నది
ప్రాణం పోసుకున్న కలలను పరిచయం చేస్తున్నది
అరుస్తున్న అరసున్నల నోళ్ళను మూసేసి
కురుస్తున్న కన్నీళ్ళభాషలో రాస్తున్నది.

ఆరిపోనున్న మానవతాజ్యోతికి అండగా
అవధులులేని ఆంతరంగిక చైతన్యాన్ని నిలిపి
ఘనీభవించిన హిమాలయ ధృవాలలో
అగ్నిపర్వతాలను ప్రేల్చి
ఆకాశానికి స్వార్థపరులు గీస్తున్న
సరిహద్దు రేఖల్ని చెరిపి
కొత్తకొత్త గ్రహాల స్వర్గాలయాలమీద
వైజ్ఞానిక ధ్వజం ఎగురవేస్తుంది.

ఇకనుంచీ నీ భవిష్యత్తు
నింగిలోనుండి నీరసంగా నీ ముంగిట్లోకిరాదు
నీకు ఎంతో దూరంగా
అది గాలి ఒడిలో పడీపడగానే
దాన్ని నా యువతరం పెంచుతుంది.
రవి కిరణాలను ఊపిరిగా పోసి
వెన్నెలను కన్నులలో కాటుకగా పూసి
జలపాతాలలో చేపలా పారే
విద్యుత్తుతో ఈతను నేర్పించి
నీనిత్య అమృత భవిష్యత్తును నీదగ్గరకు పంపుతుంది

ఈకడలిలో
పడవలు కావలసిన నీ అడుగుల అలలు
పడగలై బుసకొడుతున్నప్పుడు
జారుడుమెట్లై పడదోస్తున్నప్పుడు
కొంచెం ఆగి
ఈ స్పందించే హృదయాలు అందించే అమృతాన్ని తాగి
ఎదురుగా నడిచివస్తున్న ఆవలితీరానికి
స్వాగతం పలుకుతావు
అందుకే
ఆశాపుష్పాలై విచ్చిన ఆనందబాష్పాలను
ప్రేమతో నిమిరేగాలిని గుండెనిండా పీల్చి
గర్వంతో తలమెత్తి ఆకాశాన్ని దగ్గరగా పిల్చి
అంటున్నాను
మా యువతరం గొప్పది భావిచరిత్రకు ప్రాణవాయువు
మా యువగళం గొప్పది పాడుతుంది ప్రపంచగీతం.

## నీకివేవీం పట్టవు

పెద్దిరాజు జంపన

నిప్పంటుకున్న నీలాకాశం
ఎఱ్ఱగా చూస్తోంది
కత్తిరించబడ్డ కంఠంతో- కోయిల
వెఱ్ఱిగా కూస్తోంది
కాలం ఒళ్ళుకాలి— కుళ్ళికుళ్ళి
ఏడుస్తోంది.

నిశితంగా చూడు
విశదంగా నేడు
నడుస్తున్న మనిషిని చూసి

నక్కలు నవ్వుకుంటున్నాయి
విడుస్తున్న గులాబీపై
వడగాడుపు కొడుతోంది.
ఇంకా
ఎన్నాళ్ళు ఇక్కడ ఉండమంటావు
ఈ పంకా
ప్రతిక్షణం ఎలా తిప్పమంటావు
నలభై కోట్ల నూతుల అడుగున
నేనున్నాను.
నీలాకాశంపై నల్లరంగు
చెరపాలనుకుంటున్నాను
ఎలా
ఈ అంతర్లక్ష్యం.
ఎక్కడ దీనికి బహిర్యుద్ధం
ఈలోపల సముద్రం
ఇలా ఎన్నిసార్లు చచ్చిపోవాలి
ఇంకా
ఈ సూర్యుడు... ఇలా
ఎన్నిమార్లు పుచ్చిపోవాలి
నీకివేమీపట్టవు
నువ్వేమో నవ్వులపుట్టవు
ఒక్కసారి అటుచూడు—
మెదడు చితిలో కదులుతున్న
ఎన్నోకలలు
ప్రతి మెట్టుపైపడి చితుకుతున్న
తలలు
పురోగమించటం లేదని నేనను
ప్రతీది సుఖంగా ఉందంటేనే వినను
బతికున్న మనిషిని—
నాకొక్కడిని చూపించు

నిజం
ఈరథం ముందుకే పోతోంది— కాని
బ్రతికున్న మనిషిని
నాకొక్కడిని చూపించు.

## దేవుడు చచ్చిపోతున్నాడు

యం. ప్రభాకర్

దేవుడు చచ్చి పోతున్నాడు
అయ్యో! అయ్యో! అయ్యో! దేవుడు
చచ్చిపోతున్నాడు దేవుడు! దేవుడు!
అంతా నాస్తికులై పోతున్నారు
సమానత్వం సామ్యవాదమంటున్నారు
ప్రపంచ ధనవంతులారా! పెట్టుబడిదారులారా!!
ఏకంకండి! ఏకంకండి!
దేవుడ్ని చావనీయొద్దు
చావనీయొద్దు చావనీయొద్దు దేవుడ్ని.
దేవుడే చచ్చిపోతే?
మన పెత్తనమంతా కూలిపోతుంది
మన ఐశ్వర్యమంతా రాలిపోతుంది
బ్రాహ్మలారా! వేదవేదాంగ పండితులారా!!
రండర్రోయ్! రండి రండి రండి
హరికథలు చెప్పండి, పురాణకాలక్షేపాలు పెట్టండి
అష్టగ్రహకూటమి రాబోతుందనండి
కల్క్యావతారం దగ్గరలోనే ఉందనండి
మక్కాలో దేవుడు పుడ్తున్నాడని చెప్పండి
మద్రాసులో వినాయకుడు మొలిచాడని చెప్పండి
సత్యసాయిబాబా దైవాంశసంభూతుడనండి
ఓ దిన పత్రికలూ! వారపత్రికలూ!! నెలపత్రికలూ!!!

ఫోటోలు వేయండి, వ్యాసాలు రాయండి
ఒరే నిర్మాతలూ! సినిమాలు తీయండి
వెంకటేశ్వరమహాత్మ్యం, కాళహస్తిమహాత్మ్యం
ఇల్లందకుంటమహాత్మ్యం, మేడారం సమ్మక్కమహాత్మ్యం
తీయండి! తీయండి! తొందరగా తీయండి.
అమ్మా! ఆకాశవాణీ! వేణీ! మాజీవనరాణీ!
ప్రసారం చెయ్యమ్మా! ప్రసారం చెయ్యి
సుప్రభాతాలూ, భక్తిగీతాలూ,
ఖురాన్‌సూక్తులు, బైబిల్‌పఠనాలు, గీతబోధలు,
సూక్తిముక్తావళులు, భక్తిరంజనిలు, మంగళహారతులు
చెయ్యమ్మా! ప్రసారంచెయ్యి చెయ్యి చెయ్యి
ఓ ఎడ్యుకేషన్ డిపార్టుమెంటూ!
పిల్లలకు భక్తిపాఠాలు పెట్టండి
పసితనం నుండే భక్తిరసం పెంచండి
ఓ దేవస్థానకమిటీలూ!
ఇకనుంచి పూజాసేవ మొదలెట్టండి
చర్చి, మసీదు, గుళ్లు, గోపురాలు తెగనిర్మించండి
దేవుడు చచ్చిపోతున్నాడు, చచ్చిపోతున్నాడు
దేవుణ్ని చావనీయకండి, చావనీయకండి
ప్రపంచ ధనవంతులారా! పెట్టుబడిదారులారా!!
ఏకంకండి, ఏకంకండి, ఏకంకండి
దేవుడే చచ్చిపోతే!
మనపెత్తనమంతా కూలిపోతుంది
మన ఐశ్వర్యమంతా రాలిపోతుంది.
దేవుడు చచ్చిపోతున్నాడు
అయ్యో! అయ్యో! అయ్యో! దేవుడు.

# తక్కువరకం రచనలు

కొడవటిగంటి కుటుంబరావు

అందరు కళాకారులలోనూ శ్రేణులుంటాయి. అందరూ అత్యుత్తమ నవలాకారులూ, అత్యుత్తమ కథకులూ, అత్యుత్తమ కవులూ, అత్యుత్తమ గాయకులూ, అత్యుత్తమ చిత్రకారులూ, అత్యుత్తమ నటులూ అనిపించుకోలేరు. అందులోనూ కళకు నకిలీగీటురాళ్ళు పుష్కలంగా ఉన్న ఈనాటి మన సంస్కారంలో కళాకారుల తారతమ్యాలు నిర్ణయించటం మరీకష్టం. కవిత్వాన్ని ఏమీ అనలేనిస్థితిలో కవియొక్క వ్యక్తిగత జీవితాన్ని తూర్పారబట్టే విమర్శలు మనం చూస్తున్నాం. పబ్లిసిటీ ఊదరతో అత్యుత్తమ కళాకారుడనిపించుకోవటం కూడా ఈనాడు సాధ్యమే. కొన్నివాతావరణాలు భూతద్దాలలాగే కళాకారుడి విశిష్టతను అనేకరెట్లుచేసి చూపుతాయి. అలాటి వాతావరణాలను సినిమాలూ, రేడియోలూ, విశేష వ్యాప్తిగల పత్రికలూ సమకూర్చుతున్నాయి. ఇటీవల కృష్ణశాస్త్రిగారిని, "ఫలాని సినిమాలో పాటలు రాసింది మీరేనా?" అని అభినందనపూర్వకంగా అడిగారట!....

Industrial reserve army లాగా reserve cultural army కూడా ఉన్నది. రాసేవారిలోనూ, పాడేవారిలోనూ, నటించటం నేర్చినవారిలోనూ, నృత్యం అభ్యసించినవారిలోనూ ఏశాతం ప్రజలకు పరిచయం అవుతున్నది? ఎవరూ అంచనాలు వెయ్యలేదు. గ్రే తన ఎలిజీలో అజ్ఞాతమిల్టన్‌లనూ, షేక్స్పియర్‌లనూ కీర్తించాడు. ఏ సినిమాపాట అయినా వింటుంటే, "ఇంతకన్న బాగా పాడగలవారు అజ్ఞాతంగా ఎందరున్నారో!" అనిపిస్తుంది. పెట్టుబడిదారీ సంస్కృతి గొప్ప ప్రతిభను పైకితెస్తుందన్న నమ్మకం ఒకటి ఉన్నది. అది మూఢనమ్మకం. ప్రతిభను అణగద్రొక్కటానికి పెట్టుబడిదారీ సంస్కృతిలో ఉన్న సదుపాయాలు మరేసంస్కృతిలోనూ లేవేమో. అందుచేతనే, పెట్టుబడిదారీ సంస్కృతికి పరాకాష్ఠ అనదగిన సినిమాలలో ఏ రంగంలో చూసినా ఒక కొత్తవ్యక్తి రావటానికి అయిదునుంచి పదేళ్లదాకా పడుతున్నది. అది అలా ఉండగా, సినిమా కళాకారులలో ఉత్తములెవరు అన్న విషయమై బుర్రలు పగులగొట్టుకునేటంత అభిప్రాయభేదాలున్నాయి.

దీనికి కారణం కళలకు నకిలీ గీటురాళ్లు మాత్రమే కాదు— ఒక స్థాయిలో ఏ గీటురాయీ లేకపోవటం కూడానూ. ఒకప్పుడు, ఎవరు గొప్పకవి అన్నదాన్ని గురించి ప్రతివాడికీ అభిప్రాయం ఉండేదికాదు; అభిప్రాయం ఉండదగినవాళ్ళే అభిప్రాయం చెప్పేవాళ్లు. అలాగే గాయకులను గురించీ, నటులను గురించీనూ. ఒక అపూర్వమైన ప్రతిభావంతుడైన కళాకారుడు అవతరించినప్పుడు ఆ విషయం వెంటనే తెలుసుకోగలవాళ్లు బహుశా ఏ అయిదారుగురో ఉంటారు. వారి అంచనాను ఆమోదించేవారు వందల సంఖ్యలో ఉండవచ్చు. ఆ కళాకారుడి ఖ్యాతి వేలమందికి పాకేసరికి చాలాకాలం పట్టేది.

ఇప్పుడు అదంతా పోయింది ఇవాళ ఒకసినిమా విడుదల అవుతుంది. రేపు, ఆ చిత్రంలో ఒకపాత్ర ధరించిన ఒకకొత్తవ్యక్తికి అంతులేని ఖ్యాతిరావచ్చు. ఆ చిత్రం నడుస్తూండగానే ఆవ్యక్తికి అరడజను బుకింగులు రావచ్చు. ఇది సంభవమూ, సాధ్యమూ మాత్రమేకాదు జరిగింది. ఆవ్యక్తిప్రతిభను నిర్ణయించినది ఎవరు? సాధారణ సినిమా ప్రేక్షకులు. వాళ్ళ అర్హతల ప్రసక్తిలేదు. ఆ సినిమా చూడటానికి వాళ్ళు టిక్కెట్లు కొనటమే వారి అర్హత. వాళ్ళకు నచ్చినవ్యక్తి రేపు మరొక సినిమాలో కనిపిస్తే వాళ్ళంతావచ్చి చూసి ఆ సినిమాకు డబ్బులిస్తారు.

ప్రజాస్వామ్యంలో ప్రజలే తమకు హెచ్చుగావచ్చే కళలను ఎన్నుకోవటంలో తప్పేమిటని అడగవచ్చు. పెట్టుబడిదారీ సంస్కృతిలో కళలు ప్రజాకళలుగా రూపొందటం సాధ్యంకాదు. పెట్టుబడిదారీ కళలకు వాపేగాని బలుపు ఉండదు. కొంచెం ఆలోచిస్తే ఇది నిజమని ఎవరికైనా తెలుస్తుంది.

మళ్ళీ సినిమాలనే తీసుకుందాం. ఏ పాత్రనైనా ధరించి character actor అనిపించుకోగలవాడు సినిమాలకు అవసరంలేదు. ఈ సంగతి చాలామందికి తెలియదు. ఫలాని నటుడు ఏ తరగతి పాత్రతో మొట్టమొదట జనాన్ని బలంగా ఆకర్షిస్తే ఆ తరగతి పాత్రలతోనే అతను నాలుగుకాలాల పాటు నిర్మాతలకు డబ్బుచేసి పెట్టగలడని సినిమా పెట్టుబడిదారీ సంస్కృతి చెబుతుంది.

ఈపద్ధతి చెరుకునుంచి రసంతీసే పద్ధతి. పెట్టుబడిదారీ సంస్కృతిలో కళాకారుడు ఆత్మహత్య ద్వారానే ఉన్నతికిరాగలడు. ఒక నటుడు ఒకటి రెండు దశాబ్దాల కొద్దికాలంలో 200 పాత్రలు, ఇంచుమించు ఒకేరకానివి ధరిస్తాడు. ఒక ప్లేబాక్ గాయకుడు రెండువేల పాటలు పాడతాడు. ఒక మ్యూజిక్ డైరెక్టరు మూడువేల పాటకుల

స్వరకల్పన చేస్తాడు. ఈపద్ధతి కళాకారుణ్ణి పీల్చి పిప్పిచేసే పద్ధతికాక మరేమిటనిపించు కుంటుంది? వాపు అనక దీన్ని బలుపు అంటారా?

నిజంగా ప్రజలకు ఉపకరించే కళలు ప్రజలకళావసరాలను పురస్కరించుకొని ముందుకు సాగుతాయి. అవి పెట్టుబడిదారీ సంస్కృతికీ, కళావిధానాలకూ వ్యతిరేకంగా నడవటం తప్పనిసరి. పెట్టుబడిదారీ నుంచి దగాపడినవారికి కావలిసినవి ఇవే కళలు. ఒకదశలో వారు ఎంత కొద్దిసంఖ్యలో ఉన్నా, వారిసంఖ్య పెరిగితీరుతుంది. వారికోసం "వాస్తవమైన కళలు'' సజీవంగా ఉండాలి. వాటిని గుర్తించేవారు, వాటి వ్యాప్తికి దోహదం చేసేవారూ ఉండాలి. ఇది కనీసావసరం.

అలాటివారు సమాజంలో ఉంటూనే ఉన్నారు. దానికి సందేహం ఏమీలేదు. అయితే అటువంటివారికి కళలకు చెందిన తాత్వికదృష్టి ఒకటి అవసరమని నేను అనుకుంటున్నాను. అది చాలామందిలో లోపించిందని కూడా నాకు అనిపిస్తుంది.

పురోగామి భావాలు కలవారు ఒక సమాజంలో వ్యక్తులవంటివారు. ఒక కుటుంబంలో వ్యక్తులకున్నట్టే ఈ సమాజంలో వారికికూడా అనేక విషయాలలో తేడాలుంటాయి. ఈతేడాలు విచ్ఛిత్తికి కారణం కారాదు

పురోగమనం కళలకు అతిముఖ్యలక్షణం అని నిర్ణయించుకున్నాక, ఆలక్షణానికి విరుద్ధంగా ఉండే కళలను తీవ్రంగా ఖండించవచ్చు వాటిని పూర్తిగా నిషేధించవచ్చు. కాని అత్యున్నతమైన ఆశయంతో వెలువడే వాటిని— పురుగేరుతూ కూర్చోవటం పచ్చి బూర్జువా సంస్కృతి లక్షణం. కళాకారులను పురుగేరుతూ వచ్చి, చిట్టచివరకు ఏ ఒక్కణ్ణో కొండకొమ్మన నిలబెట్టటం పెట్టుబడిదారీ కళాపారిశ్రామికుల ధనార్జన పోటీలో చెల్లుతుంది. అది క్షయలక్షణం. మరణానికి దారితీస్తుంది.

కాని ఉన్నతాశయాలూ, సాంఘిక పురోగమనమూ కాంక్షించేవారికి వెయ్యి గొంతులు ఏకంకావాలి. ఎంత బలహీనమైన గొంతైనా అది ''మనదే'' అన్న మమత ఉండాలి. అన్నీ బలమైన గొంతులుండవు. ఏ సాహిత్యంలోనైనా రచయితల మధ్య తారతమ్యాలుంటాయి. ముందుశ్రేణిలో చాలా కొద్దిమందే ఉంటారు, మిగతావారి మాటేమిటి?

బూర్జువా సంస్కృతిలో వ్యక్తి ఆనందం మించిన ఆశయం ఉండదు. "నాకు గొప్ప అనిపించిన కవిరాస్తేనే చదువుతాను. నాకు గొప్పరచయితగా తోచినవాడి నవలలే చదువుతాను. నాకుగొప్ప గాయకుడనిపించిన వాడిపాటే వింటాను—'' ఈ ధోరణిలో

ప్రజాకళలు అభివృద్ధికావు. ఏనాడూకాలేదు. ప్రతియుగంలోనూ వచ్చిన ఉత్తమ కళలు ప్రజలను ఏకంచేశాయిగాని, విడదీయలేదు. అదే వాటికి అప్పట్లో ఉండిన బలం.

రచనలలో తారతమ్యాలు ఎలాగూ ఉంటాయి. వీటినిగురించి విమర్శకుడికి ఉండేభావాలే ప్రజలకూ ఉంటాయనుకోవటం భ్రమ. రచనలలో ఉండేపాటి వ్యత్యాసం ప్రజల గ్రహణశక్తిలోనూ ఉంటుంది. ఆశయశుద్ధిగల రచన ప్రజలలో ఏదో ఒక స్థాయిలో ఉండేవారికి అందితీరుతుంది. మన విమర్శకులు (కొందరు) విషయంకన్న విధానం ముఖ్యమనుకునే అపోహ వదిలించుకోవాలి. మనకందరికీ అంతో ఇంతో బూర్జువా సంస్కృతీమాలిన్యం ఉన్నది, అది ఒకంతట వదలదు. "ఇందులో కవిత్వం లోపించింది. ఇక్కడ వాక్యనిర్మాణం కుంటుపడింది. ఈపంక్తి బాగా ధ్వనించటం లేదు". అనే ధోరణినుంచి మన విమర్శకులు పూర్తిగా బయటపడకపోవచ్చు. కాని వాటిని ప్రచారంచేసి తమ పరిశీలనాశక్తిని లోకానికి చాటటానికి తహతహలాడటం చాలా అనవసరమనుకుంటున్నాను.

సాహిత్య ఉద్యమాలు ఎంతలో చప్పున ఆకాశం ఎత్తుపెరిగేదీ, ఎంతలో తీసిపోయేదీ నేను నాలుగు దశాబ్దాలుగా చూస్తున్నాను ఉద్యమం మందకొడిగా ఉన్నప్పుడు దాన్ని ప్రాణంతో కాపాడిన రచయితలే నా ఉద్దేశంలో నిజమైన మహారచయితలు, వినేవాళ్లు తక్కువవుతున్నట్టు కనబడగానే, అంతదాకా అందరికన్న గట్టిగా బాకా ఊదినవాడు బాకా అవతలపారేసి, అదే బాకాను తమకున్నశక్తితో ఊద యత్నించే వారిని ఎదిరించేవాడు వట్టి పాపిష్ఠివాడు. అలాటి వాళ్లంతా సినిమారంగానికి పోయి పిప్పికావటం మంచిది.

ఇవాళ తెలుగు సాహిత్యంలోకి విప్లవోద్యమం వచ్చింది. ఇది రావణుడి కాష్ఠం. విప్లవం వచ్చేదాకా ఇది కొనసాగితీరుతుంది. దీని జ్వాలలు ఒకప్పుడు తక్కువగా వుండవచ్చు. ఒకప్పుడు పెద్దగా ఎగయవచ్చు. కాని ఇందులోవేసే ప్రతిచిన్నకట్టె కూడా పవిత్రమైనది. ఆ విషయం విమర్శకులు గుర్తుంచుకోవాలి. తారతమ్యాలు సరిచేయటానికే విప్లవం రావాలి. లేనిపక్షంలో విప్లవంవచ్చినా ఒకటే, మానినాఒకటే. అలాటప్పుడు విప్లవ రచనలలో తారతమ్యాలను పనిపెట్టుకుని ప్రచారం చెయ్యటం తప్పని నాకుతోస్తుంది. ఈనాడు వచ్చే విప్లవకవిత్వమూ, విప్లవ కథలూ సమమైన చైతన్యం నుంచి పుట్టినవికావు. సమంగా చైతన్యాన్ని రేకెత్తించేవీకావు. కాని అన్నీ ఒకే చరమాశయంగలవి. విమర్శకులు వాటిని, లెన్సుసూర్యకిరణాలను కేంద్రీకరించి అగ్నిని పుట్టించినట్టు, కేంద్రీకరించి చైతన్యాన్ని వృద్ధిపరచాలి.

## ఫ్రాన్స్‌లో నూతన సాహిత్యోద్యమం

# "త్యల్ క్యల్"

నిఖిలేశ్వర్

ప్రతిదేశంలో యుగస్వభావాన్ని అనుసరించి ఆయాకాలాల్లో సాహిత్య ఉద్యమాలు వచ్చి తమ చారిత్రక బాధ్యతలను నిర్వర్తించాయి. సాహిత్యం— అందులో వచ్చే ఉద్యమాలు దేశ— కాలపరిస్థితుల కతీతంగా ఏనాడురాలేదు. ఒకవేళవచ్చినా తాత్కాలికమైన బుడగలను సృష్టించి సమసిపోయాయి. దేశంలోని సాంఘిక— రాజకీయ పరిస్థితులవల్ల స్పందించి, ఆయా పరిస్థితులను ప్రభావితంచేసి చారిత్రక కర్తవ్యాన్ని నిర్వహించిన నూతన సాహిత్య ఉద్యమాలు తెలుగు సాహిత్యంలో వచ్చాయి. ఇంకా వస్తూవుంటాయి.

1965 నుండి 1969 వరకు అత్యాధునిక తెలుగు సాహిత్యంలో వచ్చిన ఉద్యమం "దిగంబర కవులు", ఒకచారిత్రక పరిణామంలో ఉద్యమాన్ని ప్రారంభించి, సామాజిక—రాజకీయ జీవితాల నటనను, కుళ్లను విశ్లేషించి తిరుగుబాటుకు ఊపిరిపోసింది ఈ ఉద్యమం. యువతరంలో కోపాన్ని, ప్రశ్నించే చేవను కలిగించింది. విప్లవం రావలసిన అవసరాన్ని ఎలుగెత్తిచాటింది. తత్ఫలితంగా దేశంలోవున్న విప్లవపోరాటాలకనుగుణంగా "విప్లవ రచయితల సంఘం" ఉద్భవించింది.

ఈనాడు 'విప్లవ రచయితల సంఘం' నిర్వహిస్తున్న చారిత్రక బాధ్యతనీ అకాడమీల్లో కూరుకపోయిన మెదళ్లు, ప్రభుత్వ యంత్రాంగాల్లో సీలలుగా మారిన బుద్ధిజీవులు గుర్తించడానికి నిరాకరించవచ్చు. కాని ప్రజలు తమ ఆశలకు— రూపుదిద్దుతున్న ఉద్యమాలను ఏనాడు మరిచిపోరు.

'విప్లవ రచయితల సంఘం' ఏర్పడుతున్న సందర్భంలో ఒక రాజకీయపార్టీ నాయకుడు ఒక ప్రశ్న వేసాడు — "రాజకీయాలతో సమానాంతరంగా సాహిత్య ఉద్యమాలు ఈనాడు ప్రపంచంలో ఎక్కడా లేవనుకుంటా. మరి "వి.ర.సం." విచిత్రంగా రాజకీయ— సాంస్కృతిక కార్యభారాన్ని భుజానవేసుకున్న దేమిటి ?"

ఆ తర్వాత 'వి ర సం.' లాంటి సంస్థలు ఉద్యమరూపంగా ఏ దేశంలోనైనా సమకాలీన ప్రపంచంలో వున్నాయా అనేజిజ్ఞాస బయలుదేరింది, అప్పుడే ఒక ప్రఖ్యాత

హిందీ వారపత్రికలో డా. కైలాశ్‌వాజ్‌పేయీ రచించిన ఒక వ్యాసం చదవడం సంభవించింది. డా. కైలాశ్‌వాజ్‌పేయి హిందీలో ఆధునిక యువకవుల్లో ఒకరు. ఆయన ఇంగ్లీషు సాహిత్యంలో డాక్టరేట్ పొందిన సాహిత్యవేత్త. 1970 జులై ఆ ప్రాంతాల్లో ఆయన ఫ్రాన్స్‌లో సాంస్కృతిక పర్యటన కొనసాగిస్తున్నప్పుడు ఫ్రాన్స్‌లో వచ్చిన నూతన సాహిత్యోద్యమం "త్యల్‌క్యల్" గురించి వివరంగా తెలుసుకొని రాసారు. ఈ "త్యల్‌క్యల్" సాహిత్యోద్యమానికి "వి. ర. సం"కు కొన్ని స్థూలమైన పోలికలు వున్నాయి.

1960 నాటి నుండి ఈనాటివరకు కొనసాగుతున్న ఈ "త్యల్‌క్యల్" ఉద్యమం సాహిత్యంలో సంచలనాన్ని లేవనెత్తింది. ఫ్రాన్స్‌లో వచ్చిన సాహిత్యోద్యమాలన్నీ ప్యారిస్ నగర జీవితంలోనుంచి పుట్టినవే. ఫ్రెంచి సంస్కృతి ప్రధానంగా నగర సంస్కృతి. నగర జీవితంలోని సంఘర్షణవల్లనే ఈ ఉద్యమాలు జన్మిస్తుంటాయి.

ఇంతకు ప్యారిస్ నగరజీవితం ఎలాంటిది? డా. వాజ్‌పేయి వర్ణిస్తున్న దృశ్యాం ద్వారా తెలుసుకోవచ్చు— "పేవ్‌మెంట్‌ల పైని రెస్టారెంట్లు– ఆర్డర్‌లు తీసుకొంటున్న బిగుతు దుస్తుల్లోని యువతులు– మెట్రో (భూగర్భ రైలుమార్గం) లో విడిపోతున్న ప్రేమికులు– చల్లని రాత్రిలు– చివరి ముద్దు– లూవ్రి గ్యాలరీలో చిత్రాలముందు మౌనంగా నిలుచున్న మనుష్యులు— ల్యాటిన్ టవున్‌లోని పబ్‌లు ('బార్' లాంటివి) విప్లవం గురించి మాట్లాడుతున్న యువకులు - ఫ్రూట్ సైన్, వరసాయి సరస్సు ఒడ్డుపై ఆలింగనంలో జంటలు– ముప్పై ఫ్రాంక్‌లలో పర్యటకుల చిత్రాలువేసి ఇస్తున్న మోమార్త్ చిత్రికారులు- ప్యాషన్– ధరల పెరుగుదల– విప్లవం ......."

ఫ్రాన్స్ నగరజీవితం, బూర్జువావ్యవస్థ ఫలితంగా డొల్లగా మారింది. ఈడొల్ల సంస్కృతిలో సమూలమైన మార్పుతేవాలని "త్యల్‌క్యల్" రచయితలు వాంఛిస్తున్నారు. అయితే ఈ మార్పును చైనాలోమాదిరి మొదలు ఆర్థిక వ్యవస్థద్వారా తర్వాత సాంస్కృతిక విప్లవం ద్వారా తేవాలనికాదు. ఒకేసారి భావవిప్లవాన్ని– సాంఘిక విప్లవాన్ని తీసుకరావాలని ప్రియత్నం. అందువల్ల సాహిత్యంలో వ్యక్తివాదాన్ని కాకుండా సామూహిక వాదాన్ని ప్రవేశపెట్టామని 'త్యల్‌క్యల్' సభ్యుల వాదన.

ఇంతకు "త్యల్‌క్యల్" అంటే ఏమిటి? "త్యల్‌క్యల్" (As it is) కు "యథాతథం"గా అనే సమానార్థాన్ని తీసుకోవలసివుంటుంది. 'యథాతథంగా' వున్న సామూ

జిక- రాజకీయాన్ని, జీవితాన్ని స్వీకరించి రాబోయే విప్లవానికి మానసికస్థాయిలో విప్లవాన్ని పరిశస్తం చేయడం ఈ ఉద్యమం యొక్క ప్రధానలక్ష్యం.

ఈ ఉద్యమానికి ముఖ్యమైన మూడు ఆధారాలున్నాయి— మొదటిది మార్క్సిస్టు తత్వం. రెండోది లెనినిస్టుతత్వం— దానిని మనోవిశ్లేషణ ద్వారా వ్యాఖ్యానించి అంగీకరించడం. మూడోది- సర్రియలిజం నుండి విడివడి ప్రాచ్యసంస్కృతిని వైజ్ఞానిక హేతువాదంతో అంచనావేసి స్వీకరించడం. వీటితోబాటు వీళ్ళు ప్రసిద్ధ ఫ్రెంచికవి 'మలార్మే' కవితాతత్వాన్ని పరిశంసిస్తున్నారు.

ఈ "త్యల్‌క్యల్" సంస్థ సభ్యులు వివిధ ప్రక్రియల్లో రచనలు చేస్తున్నారు. అయితే- సాహిత్యప్రక్రియల విభజన అనేది బూర్జువాపద్ధతి అని, పత్రికకు 'సంపాదకుడు' అనేవాడు కూడా బూర్జువా వ్యవస్థకు చిహ్నమని వీరివాదన. అందువల్లనే "త్యల్‌క్యల్" పత్రిక సామూహిక బాధ్యతతో వెలువడుతున్నది.

సౌలభ్యంకోసం వివిధప్రక్రియల ననుసరించి ఈ రచయితలు ఈనాటికి రచనలు సాగిస్తున్నారు— యాంలూయీబాద్రీ (నవలా రచయిత- వ్యాసరచయిత); మార్సెల్ ప్లీనే (కవి); యాంరికార్డో (వ్యాస, నవలా రచయిత); జెకలిన్ రిజె (కవయిత్రి); డెనిష్‌రోశే (కవి); ఫిలిప్ సోలేస్ (గద్య- రచయిత- కథా రచయిత).

'త్యల్‌క్యల్' కార్యాలయంలో గోడపైవున్న లెనిన్- మావో చిత్రాలు ఈ ఉద్యమం ఫ్రెంచి సాంస్కృతిక దృక్కోణాన్ని వ్యతిరేకిస్తున్న విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. 'త్యల్‌క్యల్' మొదట్లో కఠోరమైన యథార్థాన్ని మాత్రమే స్వీకరించిందని, ఆ తర్వాత లెనిన్, మావో ఆలోచనా విధానాన్ని స్వీకరించి విప్లవాత్మకమైన పరిణతి పొందిందని డా. కైలాష్ వ్యాఖ్య.

"త్యల్‌క్యల్" 1968 నాటి ఫ్రెంచి విద్యార్థుల తిరుగుబాటువల్ల కూడా ప్రేరణ పొందింది. ఆ తిరుగుబాటు నాయకుడు డేనియల్‌కోహన్ బెండ్‌వలసపత్రాలను ఫ్రెంచి ప్రభుత్వం లాక్కొన్నప్పుడు ప్యారిస్‌లోని 20వేల మంది విద్యార్థులు ఫ్రెంచి ప్రభుత్వాన్ని పెట్టిన ముప్పుతిప్పలు- ఆ తర్వాత వచ్చిన పరిణామాలు ఈ రచయితలను ప్రేరేపించాయి. అంతకంటే పూర్వం ఫ్రెంచి సాహిత్యంలో వచ్చిన సర్రియలిజంలోని కొన్ని అంశాలనుకూడా వీళ్లతీసుకున్నారు. అసలు ఈ ఉద్యమం బీజాలు సర్రియలిజంలోనే వున్నాయని అంటారు. ప్రథమ ప్రపంచ మహాయుద్ధం తర్వాత నెలకొన్న

భీభత్స దృశ్యాలవల్లనే సర్రియలిజం జన్మించింది– అందులోని నగ్నయథార్థవాదాన్ని స్వీకరించి వీళ్లు అంతర్గతంగావున్న మార్మికవాదాన్ని తిరస్కరించారు కేవలం వైజ్ఞానిక హేతువాదాన్ని మాత్రమే అంగీకరించారు. అలాగే మావో "రెడ్ బుక్" (మావో సూక్తులు) ప్రభావం వీరిపైవుందని డా. కైలాశ్ అభిప్రాయం.

ఈ సందర్భంలో ఆయన ఫ్రెంచి విద్యార్థి నాయకుడైన యాంగోరేతో జరిగిన సంభాషణను ప్రస్తావిస్తున్నారు. ల్యాటిన్ క్వార్టర్‌లోవున్న ఒక "పబ్"లో యాంగోరే తనచేతిలోవున్న రెడ్ బుక్‌ను చూపుతూ ఇలా అన్నాడట— "Either there will be one Socialist world or there will be no World" (వుంటే ఒకే సోషలిస్టు ప్రపంచం మాత్రం వుంటుంది లేదా అసలు ప్రపంచమనేదే వుండదు).

యాంగోరే "నాయకత్వం" అనే అంశంపై పరిశోధన చేస్తున్నవాడు. అతన్ని రెండుసార్లు పెద్దమొత్తాల్లో జీతం ఇచ్చే ఉద్యోగాలు ఇస్తామని అధికారులు కోరారట. కాని అతను ఇలా అంటూ తిరస్కరించాడు— "బూర్జువాజీ వలలోకి అంత సులువుగా చిక్కుకునేవాడ్ని కాను".

"త్యల్‌క్యల్" సాహిత్యాన్ని చదివే పాఠకులు ప్రధానంగా విశ్వవిద్యాలయ విద్యార్థులు. ఈ విద్యార్థులవల్లనే విప్లవం వస్తుందని వీరివిశ్వాసం. ఫ్రాన్స్‌లో రాబోయే విప్లవం ఒకకొత్త వ్యవస్థను రూపొందిస్తుందని, అది రష్యాలాంటి వ్యవస్థకాకుండా చైనాలాంటి వ్యవస్థ అవుతుందని అదికూడా చైనాను యథాతథంగా అనుకరించడం కాకుండా మూడో విధమైన వ్యవస్థగా రూపొందాలని వీళ్ళు వాంఛిస్తున్నారు.

ఇక్కడ నాకు లెనిన్ ఒక సందర్భంలో అన్నమాటలు జ్ఞాపకం వస్తున్నాయి. "ప్రపంచంలో విప్లవం పెకింగ్‌నుండి కలకత్తాగుండా ప్యారిస్‌నగరం చేరుకుని పరిపక్వ దశను పొందుతుంది" ఈ చారిత్రకమైన అంచనాను ఈనాటి కలకత్తా పరిస్థితులకు అన్వయించి పరిశీలించినవుడు పై మాటల యథార్థం అవగతమవుతుంది.

జ్యాపాల్‌సార్త్‌ను 'త్యల్‌క్యల్' సభ్యులు పాత సమాజానికి చెందిన తత్వవేత్తగా భావిస్తున్నారు. సార్త్ వామపక్షానికి చెందిన తత్వవేత్త అయినా ఆయనకు సాంస్కృతిక విప్లవంపట్ల స్పష్టమైన అభిప్రాయంలేదని అందువల్ల ఆయన మాకు 'గడిచిన కాలం' కిందే లెక్క అని వీళ్లు అంటున్నారు. ఈనాటి యువతరంలో అల్‌థ్యూసే ప్రభావం గాఢంగావుందని అతనే ఈ నవసమాజానికి చెందిన తత్వవేత్త అని వీళ్ళ అభిప్రాయం.

అల్‌థ్యూసే రచించిన రెండు గ్రంథాలు, ''పెట్టుబడి– ఒక పరిశీలన''; ''లెనిన్– ఆయన తత్వం''. ఈరెండు గ్రంథాలు ఫ్రెంచి యువతరాన్ని బాగా ఆకట్టుకున్నాయి.

"త్యల్‌క్యల్"సభ్యుల రచనలలో వర్గసంఘర్షణ, సామాన్యుల జీవితచిత్రణ విరివిగా జరుగుతున్నది. ప్రత్యేకించి గద్యరచనలలో వీటికి ప్రాముఖ్యమిస్తున్నారు.

సభ్యులలో ఒకరైన ఫిలిప్ సోలెస్ భౌతికవాదాన్ని తనధోరణిలో వ్యాఖ్యానిస్తూ ఒక గ్రంథం రచిస్తున్నారు. ఆ గ్రంథంపేరు 'మెటీరియలిజం థ్రు మార్క్స్ అండ్ లెనిన్'.

ఈనాడు గతితార్కిక భౌతికవాదాన్ని, చారిత్రిక భౌతికవాదాన్ని, శుద్ధ భౌతిక వాదాన్ని విడివిడిగా పరిశీలించి మార్క్సును నూతనదృక్కోణంతో వ్యాఖ్యానించవలసిన అవసరముందని సోలెస్ భావిస్తున్నాడు. మార్క్సు నిర్వచించిన గతితార్కిక భౌతిక వాదం ఒక ప్రత్యేక సామాజిక పరిస్థితిని కోరుతున్నది అలాంటి సామాజిక పరిస్థితి వున్నచోట సామ్యవాదం మార్క్సు ఊహననుసరించి ప్రతిఫలించింది. కాని అలాంటి సామాజిక పరిస్థితులు లేనిపక్షంలో గతితార్కికవాదం కేవలం ప్రాసంగికమైపోతుంది. మార్క్సు ఆలోచనలోని చారిత్రిక అంశాలను విడదీసిచూసినపుడు ఆ ప్రాసంగికమైన అంశం తొలగిపోతుంది. మార్క్సునుండి విడిగా మరోభౌతికవాదం నెలకొనివుంది. ఆవాదాన్ని మార్క్సు ఆలోచనావిధానంతో ఈనాడు జోడించవలసిన అవసరంవుందని సోలెస్ అభిప్రాయం.

గత రెండుపందల సంవత్సరాలనుండి యూరోప్ సాహిత్యంలో తరుచుగా నూతన సాహిత్యఉద్యమాలకు, నూతనప్రక్రియలకు, ప్రయోగాలకు ఫ్రెంచిసాహిత్యం ఆదర్శంగావుంటూవచ్చింది. సాహిత్యం కేవలం సాహిత్యంకోసమని, కళ-కళకోస మనేభావజాలం ఫ్రెంచిసాహిత్యంలో అన్నియుగాల్లోవుంది. కాని ఈనాడు పాశ్చాత్య అరాచక-అనిబద్ధవైఖరికి భిన్నంగా 'త్యల్‌క్యల్' తన ఉద్యమాన్ని కొనసాగిస్తున్నది.

ఇక 'వి.ర.సం.'కు 'త్యల్‌క్యల్'కువున్న స్థూలమైన పోలికలు కొన్నిమాత్రమే. వీటిలో ప్రధానంగా రెండు ఉద్యమాలుకూడా మార్క్సిస్టు–లెనినిస్టు–మావో ఆలోచనా విధానాన్ని ఆధారభూతం చేసుకున్నాయి. రెండూకూడా రాజీలేని సాంస్కృతిక పోరాటాలను నిర్వహిస్తున్నాయి. అలాగే అక్కడ యిక్కడ అకాడమీ మహాశయులు ఈ ఉద్యమాలను నిశితంగా విమర్శిస్తున్నారు- అసలు గుర్తించ నిరాకరిస్తున్నారు, అయితే ఈ రెండింటిమధ్యవున్న ప్రధానమైన వైరుధ్యం– 'త్యల్‌క్యల్'కు అధి వాస్తవికపునాదులున్నాయి:'వి.ర సం.'కు కార్మిక-రైతాంగపోరాటాలఅనుభవాలు దోహదంచేస్తున్నాయి.

# ఒక మరణం - ఒకచావు

డి. వెంకట్రామయ్య

మంత్రిగారి బామ్మగారు మరణించారు. సరిగ్గా రాత్రి తొమ్మిదిన్నరకి యిహలోకయాత్ర చాలించి పరలోకానికి ప్రయాణంకట్టారు. సమయానికి మంత్రిగారు ఊళ్ళోలేరు. తమ బామ్మగారికి రోజులు దగ్గరకొచ్చాయని తెలుసుకున్నవారైనప్పటికిన్నూ. ప్రజాసేవయే పరమధర్మంగా యెంచుకున్నవారుగనుక ఆరోజు ఉదయమే ఊరికెళ్లారు.

అక్కడకి యాభైమైళ్ళదూరానవున్న ఒకానొక పట్టణంలో, ఆస్పత్రికట్టాల్సిన స్థలంలో ఆస్పత్రి కట్టనివ్వకుండా, ప్రజలకి యితోధికమైన సేవచేసే సదుద్దేశ్యంతో- 'ఎయిర్ కండిషన్డ్ మరియూ బార్ ఎటాచ్డ్' హోటల్ నిర్మించాడొక పుణ్యాత్ముడు. 'ఆ పుణ్యాత్ముడు మరెవరోకాదు, మన మంత్రిగారి మేనమామకొడుకే' నంటూంటారు కొందరు పాపాత్ములు. ఆ విషయం మనకప్రస్తుతం. సరే, సదరు హోటేలుకి ప్రారంభోత్సవం చెయ్యవలసిందని, మన మంత్రిగారిని 'కోరినవెంటనే' 'దయతో అంగీకరించి'- అతిముఖ్యమైన రాచకార్యాలన్నీ పక్కకునెట్టి, మరణశయ్యమీదనున్న బామ్మగారినికూడ విడిచిపెట్టి పొద్దున్నే బయల్దేరి అక్కడికెళ్ళిపోయారు.

మంత్రిగారి బామ్మగారి వయసు తొంభైనాలుగు సంవత్సరాలు. అంతపిన్న వయసులోనే ఆమె అకాలమరణం చెందినందుగ్గాను- మంత్రిగారి బంధుమిత్రులూ అనుచరులూ సహచరులూ యింకా చాలామందీ మంత్రిగారింటికెళ్ళి భోరున ఏడ్చారు. మరికొంతమంది మంత్రిగారొచ్చాక ఏడవొచ్చులే, యిప్పట్నించీ ఎందుకు వేస్టనీ, అతికష్టమ్మీద ఏడుపు ఆపుకొంటున్నారు.

మంత్రిగారికి అరడజను ట్రంక్ కాల్సూ. డజను టెలిగ్రామ్సూ వెళ్లాయి. పురప్రముఖులుకొందరు కార్డుపంపారు. కొందరు స్వయంగా మంత్రిగారికెదురెళ్లారు.

ఇతరమంత్రులయిళ్ళకీ, ముఖ్యమంత్రిగారింటికీ, గవర్నర్ గారింటికీ, శాసనసభ్యులయిళ్ళకీ, న్యాయమూర్తులయిళ్ళకీ, ఉన్నతాధికారులయిళ్ళకీ, పురప్రముఖుల

యిళ్ళకీ వర్తమానాలువెళ్లాయి. అంతా హడావిడిగా బయల్దేరి వచ్చేశారు. కొందరు పెద్దలుమటుకు మంత్రిగారొచ్చాక కబురుచెయ్యమన్నారు జనం విపరీతంగావచ్చారు. పత్రికా విలేఖరులొచ్చారు. ఫోటోగ్రాఫర్లొచ్చారు. పోలీసువాళ్లొచ్చారు. సినిమా స్టార్లొచ్చారు. మంత్రిగారి యిల్లు కిటకిటలాడిపోయింది.

కొందరు—కాలుగాలిన పిల్లుల్లా, నిప్పుతొక్కిన కోతుల్లా యింట్లోంచి బయటికీ బయటినుంచి యింట్లోకీ పరుగులెత్తుతున్నారు. ఒక్కరొక్కరుగా విచ్చేస్తున్న పెద్దలకి స్వాగతాలుచెప్పి లోపలికి తీసుకెళ్తున్నారు. కొందరు—వచ్చిన పెద్దలచుట్టూ చేరుతున్నారు. మరికొందరు మంత్రిగారి బామ్మగారి జీవితవిశేషాలు చెప్పుకుని విచారిస్తున్నారు. కొందరు శవానికి సేవలుచేస్తున్నారు. ఈగలూ దోమలూ రాకుండా విసనకర్రలుపుచ్చుకు విసురుతున్నారు. కంపుకొట్టకుండా పన్నీరు చల్లుతున్నారు. అగరువత్తులు వెలిగిస్తున్నారు. కొందరు మంత్రిగారి సతీమణికీ, పిల్లలకీ విసురుతున్నారు. ఫాన్‌గాలికి ఉక్కిరిబిక్కిరైపోతారని విసనకర్రలుపుచ్చుకుని అతిజాగ్రత్తగా అతిమెల్లగా విసురుతున్నారు. కొందరు కళ్లతుడుచుకుంటున్నారు; కొందరు ముక్కులుచీదుతున్నారు. ఓదార్చుదామంటే మంత్రిగారి సతీమణిగాని, పిల్లలుగాని ఏడవటంలేదు. తలోకుర్చీలోనూ సీరియస్‌గా కూర్చున్నారు.

అర్థరాత్రి పన్నెండున్నరకి—ముందు నాలుగుకార్లూ వెనక నాలుగుకార్లూ తోడురాగా— మధ్యనున్నకారులో మంత్రిగారు విచ్చేశారు. కారుతలుపు స్వంతచేతుల్తోతెరిచే సౌభాగ్యంకోసమూ, మంత్రిగారికి మొట్టమొదట సానుభూతి తెలియపర్చే మహదవకాశంకోసమూ, మంత్రిగారు లేకపోయినా ఏలోటూలేకుండా తామెటువంటి ఏర్పాట్లు చేశారో విన్నవించుకోడంకోసమూ— చాలమంది కారుమీదికెగబడ్డారు. లోపలున్నవాళ్లు కూడ పరుగెత్తుకొచ్చి కారుచుట్టూమూగారు. పోలీసులు జోక్యంకలగజేసుకుంటేగాని మంత్రిగారు లోపలికెళ్ళడానికి వీలైందికాదు

మంత్రిగారు యింట్లోకిరాగానే చాలమంది ఏడవటం మొదలెట్టారు. మంత్రిగారు మౌనంగావెళ్లి బామ్మగారి శవంపక్కన కూచున్నారు. ఉలకలేదు; పలకలేదు; పరమసీరియస్‌గా శవాన్నిచూస్తూ కూచున్నారు. ఆయనా ఏడవకపోయేసరికి ఓదార్చుదామని కూర్చున్నవాళ్ళకి మరోసారి ఆశాభంగం కలిగింది.

పెద్దలొక్కరొక్కరూ మంత్రిగారిదగ్గరకొచ్చి తమ తీవ్రసంతాపాన్నీ, ప్రగాఢసానుభూతినీ వ్యక్తపర్చి శెలవుతీసుకు వెళ్ళిపోయారు. ఆతర్వాత మంత్రిగారు తమ

ఆంతరంగికులైనవారితో కొద్దిసేపుముచ్చటించి, రేపటి అంత్యక్రియల ఏర్పాట్లగురించి ఆదేశాలిచ్చి, మేడమీదికెళ్ళిపోయారు.

సరిగ్గా అదేసమయాన—మంత్రిగారింటికి రెండుఫర్లాంగులదూరాన-ఒకగుడిసెలో-

కిరసనాయిల్‌దీపం గుడ్డివెలుగులో— దిక్కూ మొక్కూ, డబ్బూ దస్కం ఏమీలేని అభాగ్యుడొకడు— అనామకుడొకడు— పాతికేళ్ళభార్యశవాన్ని ముందెట్టుకూర్చున్నాడు.

అతని భార్యకి తిండిలేక రోగమొచ్చింది. డబ్బులేక చచ్చిపోయింది.

వారంరోజులు నరకయాతన లనుభవించి అంతకి గంటక్రితమే కన్నుమూసింది.

ఏం చెయ్యాలో అతగాడికేం తోచడంలేదు. కాళ్ళూచేతులూ ఆడ్డంలేదు. బంధువుల్లేరు; స్నేహితుల్లేరు; శవాన్ని తగలెయ్యడానికూడా డబ్బుల్లేవు; కళ్ళనిండా నీళ్లు మాత్రమున్నాయి. దొక్కనిండా, గుండెనిండా చిరుగులు మాత్రమున్నాయి.

అతనిపేరూ ఊరూ అనవసరం! మహామహా మంత్రిగారిపేరే మనం చెప్పుకోవటంలేదే- ఆ అనామకుడి పేరెందుకు? అనామకుడనే అందాం.

* * *

తెల్లవారింది.

మంత్రిగారింట్లో మంత్రిగారూ ఆయన భార్యాపిల్లలూ ఏమోగాని— మంత్రిగారి భక్తబంధుజనం మటుకు తెల్లార్లూ శవజాగరణ చేశారు పాపం. మంత్రిగారి బామ్మగారి ఆకస్మిక మరణవార్తని ఆకాశవాణివారు చింతిస్తూ ప్రకటించారు. వార్తా పత్రికల్లో మొదటిపేజీల్లో ప్రముఖంగా ప్రచురించారు.

మంత్రిగారి బామ్మగారి ఫోటోదొరక్క- ఒక పత్రికవారు మంత్రిగారి ఫోటోనే వేసేసి- 'ఫలానా మంత్రిగారిపై పిడుగుపాటు— దేశానికి తీరనిలోటు'— అని శీర్షిక పెట్టారు. మరోపత్రికా సంపాదకుడు— 'ఫలానా మంత్రిగారి పితామహి మరణం' అని శీర్షికపెట్టి ప్రెస్సుకి పంపితే— ప్రెస్సులో అక్షరాలుకూర్చే ఆయనకి ఆవేశమొచ్చి అందులో యింకో అక్షరంకూడా చేర్చేశాడు. చివరికి— 'ఫలానా మంత్రిగారి పితామహిషి మరణం'- అని అచ్చయింది. ఆ పత్రికవారిమీద మంత్రిగారు ఆగ్రహించడం వేరేకథ.

ఉదయం తొమ్మిదిగంటలకి బ్రహ్మాండమైన ఊరేగింపుతో శవయాత్ర ప్రారంభమైంది. ఒకలారీలో పెద్దవేదిక నమర్చి దానిమీద శవాన్ని పడుకోపెట్టారు. పక్కనే మంత్రిగారు నిలబడ్డారు. మంత్రిగారి భార్యా బిడ్డలూ, యితర పెద్దలూ లారీకిముందూ వెనకా కార్లలో కూర్చున్నారు.

ఇంకా కార్లూ, మోటార్ సైకిళ్ళూ, సైకిళ్ళూ, రిక్షాలూ చాలాచేరాయి. మంత్రిగారి యింటికి శ్మశానం అరమైలుదూరముంటే, యివన్నీకలిసి మైలుపొడవయ్యాయి.

దారిపొడుగునా— చాలమంది ప్రముఖులూ వ్యాపారసంస్థలవారూ, దుకాణాలవారూ బామ్మగారి 'భౌతికకాయం' మీద పూలమాలలుంచి, శవానికీ మంత్రిగారికీ కూడ నమస్కారాలు చేసి తమతమ భక్తిప్రపత్తులు వెల్లడించుకున్నారు. శ్మశానానికి చేరేటప్పటికి పదకొండైంది. అప్పటికే అక్కడ ఒకపెద్ద చితి అందంగా పేర్చివుంచారు. పైన రెండొారసలు గంధపుచెక్కలు కూడా పేర్చారు కలప వ్యాపారస్తుల సంఘంవారు ఒకలారీనిండా మాంచి ఎండుకట్టెలు పంపారు. నూనెవర్తకుల సంఘంవారు నేతిడబ్బాలు పంపారు.

మంత్రిగారితో పాటు యితర పెద్దలుకూడా కార్లుదిగి చితివరకూ నడిచారు. మిగతాజనాన్ని కాస్త ఎడంగానే పోలీసులాపేశారు. దహనకాండ ప్రారంభమయ్యేముందు— మంత్రిగారి కుడిభుజ మొకాయన కాస్సేపు ఉపన్యసించాడు. బామ్మగారి గుణగణాల్ని ప్రశంసించి, ఆవిడ మరణం రాష్ట్రానికేకాక, యావద్భారత దేశానికీ, మళ్ళీ మాట్టాడితే యావత్ప్రపంచానికీ ఎంతనష్టమో వివరించాడు.

తనకీ అవకాశం కలిగించినందుకు బామ్మగారికి కృతజ్ఞతలుచెప్పుకుని ఉపన్యాసం విరమించాడు. మంత్రిగారి యెడంభుజంకూడ మాట్లాడదామనుకున్నాడుగాని మంత్రిగారే వద్దని వారించారు.

బామ్మగారి మరణానికి దేవతలు కన్నీరుకారుస్తున్నట్టుగా— సన్నగా చినుకు ప్రారంభమైంది చితిమీద శవాన్ని పడుకోబెట్టారు. జరగవలసిన తతంగమంతా జరిగాక, చితిమీద నెయ్యికుమ్మరించి, నిప్పంటించారు మంత్రిగారు. భగ్గున, నిలువెత్తున మంటలులేచాయి.

సరిగ్గా అదేసమయాన - అదేశ్మశానంలో మరోమూల- అపుల్లా ఈపుల్లా ఏరుకుని, చెత్తా చెదారం పోగుచేసి, భార్యశవాన్ని దహనంచెయ్యడానికి నానాతిప్పలూ పడుతున్నాడు అనామకుడు.

చినుకుకాస్త పెద్దదైంది. అంటుకున్ననిప్పు ఆరిపోయింది. ఇంకేంచెయ్యలేక చతికిలబడ్డాడు అనామకుడు. వాళ్ళదగ్గరా వీళ్ళదగ్గిరా అడుక్కున్న పైసలు కాటిసుంకానికే సరిపోయాయి. కట్టెలు కొనడానికి మిగల్లేదు.

తలెత్తి నల్దిక్కులాచూశాడు. ఆమూల- మంత్రిగారి బామ్మగారి చితి యింకా దివిటీ వెలిగినట్టు వెలుగుతూనేవుంది.

ఉన్నట్టుండి ఆకాశంలో నలువైపులా కారుమబ్బులు కమ్ముకొచ్చాయి. మంత్రిగారి బామ్మగారి అంత్యక్రియలుచూడ్డానికొచ్చిన జనమంతా వెళ్ళిపోయారు. బామ్మగారి భౌతికకాయం దాదాపు బూడిదైంది. బూడిదయ్యేదాకా వుంటామన్నవాళ్ళిద్దరూ, కాస్త వెచ్చగా ఏదైనాతాగివద్దామని ఎక్కడికో వెళ్లారు. శ్మశానంలో ఒక్కపురుగుమిగల్లేదు అనామకుడుతప్ప.

అంతా వెళ్ళిపోయాక అనామకుడు మెల్లగాలేచి- భార్యశవం భుజానవేసుకుని, బామ్మగారి చితిదగ్గరకొచ్చాడు శవాన్ని కిందదించాడు. ఒక్కనిమిషం ఆలోచించాడు. ఆలోచించే వ్యవధిలేదు. పెద్దవర్షం వచ్చేట్టుగావుంది వేరే చితి తయారుచేసిఅంటించాలంటే కష్టం. ఈలోగా యెవరైనారావచ్చు అందుకే వెంటనే తనకర్తవ్యం నిర్ణయించుకున్నాడు.

విడిగాపడివున్న కట్టెలు కొన్నితీసి చితిలోవేశాడు భార్యశవాన్ని చితిమీదవుంచి మరికొన్ని కట్టెలు వేశాడు. మంటలు మళ్ళీ విలువెత్తునలేచాయ్!

* * *

కొద్దిరోజులతర్వాత— మంత్రిగారిబామ్మగారి చితాభస్మాన్ని నగరానికి సమీపాన వున్న నదిలో కలపడంకోసం— పెద్దఎత్తున ఏర్పాటైన కార్యక్రమంలో, అనామకుడు కూడ ఆనందంగా పాల్గొన్నాడు.

సమీక్షలు:

# మాదీ మీవూరే - రెండు సమీక్షలు

[కడ]గళ్ళ చొక్కా-రావులు

గళ్ళచొక్కా వద్దంటున్నాడు కడగళ్ళ చొక్కా వేసుకొన్న ఒకానొక పెద్దమ్మ ముద్దుబిడ్డ. అతని జీవితమంతా లోకమనే చదరంగంలోని సుఖదుఃఖాల తెలినలిగళ్ళలో పరాధీనంగా తిరిగే ఒకపావు మాత్రమే. అతనికి ఒక పేరులేదు పేర్లన్నీ తనవే. ఒక వూరులేదు. ఊర్లన్నీతనవే. అతగాడే ఈదేశపు సగటుమనిషి— "వీథిమానిసి". కవిగారి వర్ణనప్రకారం, అతడు "అనామకుడు, దిగంబరుడు, శూదా (Sic) ద్రుడు". కవిగారు అతగాణ్ణి తన ''అనుంగు సోదరుడు''గా సంభావిస్తున్నారు. అతని కడగళ్ళ వడగళ్ళ బతుకును వర్ణిస్తున్నారు. ఆ వర్ణించడం తానుగా చెయ్యక, అతనిద్వారానే చేయిస్తున్నారు.

అభ్యుదయ కవుల నడిమితరానికి చెందిన చివరి కవులలో శ్రీ సి. వి. కృష్ణా రావుగారొకరు. 'అభ్యుదయ' శబ్దం అభాసుపాలైన నేటి స్థితినుంచి మనళ్ళక్షువుతోటి వెనక్కు చూచుకొంటే, అది ఎంతసత్యకాలమో అని ఆశ్చర్యం కలుగుతుంది. కవులు అప్పటికి ఇంకా తమ చిత్తశుద్ధిని భాగ్యలక్ష్మి పాదాలకు నైవేద్యం పెట్టుకోలేదు. రాజకీయాన్ని రంకుతనంగా ఎంచుకోలేదు దౌర్బల్యపు కన్నీళ్ళతోటి ఉద్యమాగ్ని జ్వాలలను ఆర్పుకోలేదు. సినీమాయకో, అకాడెమి డమామీలకో. తమ మనస్సు లను బధిరాంధం చేసుకొని, ప్రజా పోరాటాలను ఎద్దేవాచెయ్యలేదు. 'అభ్యుదయం' అప్పటికి ఇంకా కపటనాటకంగా, జీవనాధారంగా, మార్పుచెందలేదు. అందుచేతనే సి. వి. కృష్ణారావుగారి వచన గేయాలనుతీసి తుంగలో తొక్కాలనిపించడం లేదు.

''మాదీ మీ ఊరే'' అనే ఈ కవిత సంకలనాన్ని ''సృజన పరిచురణ'' గా 1969 లోనే ప్రకటించడమైతే జరిగింది గాని దానికి రావలసినంత గుర్తింపు ఇంకా రాలేదు. ముందు ముందు వస్తుందో రాదోకూడా తెలియదు. దీనికి కారణమేమిటి? కవి ఇంకా 'అభ్యుదయ' యుగానికే అంటిపెట్టుకొని ఉండడమేనని అనిపిస్తుంది. సామాన్యుణ్ణి సామాన్యుడిగానే పిలిచి పెద్దపీటవెయ్యడం 'అభ్యుదయ' యుగం తాలూకు లక్షణాలలో ప్రముఖమైనది. నిజానికి, సామాన్యుడు అసామాన్యుడైనప్పుడే మాన్యుడు

కావాలి. అలా ఎప్పుడౌతాడని అడిగితే, తన సగటుగుణాన్ని— దుర్గుణాన్ని— వదులుకొని తనలాంటి ఇతరులతో చెయ్యీవాయీ కలిపి, నీరసత్వం నుంచి బయటపడి, ఉద్యమశక్తిగా రూపొంది, చరిత్రను జూలుపట్టి దౌడుతీయించినప్పుడేనని జవాబు. అలాంటి మహోద్యమాలకు దూరంగా ఉన్న సామాన్యుడు తనకుతానే భారమౌతాడు. అలాంటప్పుడే ఇలాంటి నిట్టూర్పులుగానీ స్వగతాలుగానీ విన్నపాలూ వినయాలూ యావత్తూ— గేయరూపం ధరించడం జరుగుతుంది. సి. వి. కృష్ణారావు వచనగేయాల బలమైనా దౌర్బల్యమైనా ఇదే.

ఇంతమాత్రమేకాదు. కవి తేటతెల్లంగారాస్తూ ఉన్నాడనిపిస్తూకూడా తనమాటల చేత అర్థస్ఫురణ చేయించజాలని చిక్కు ఒకటి తోడౌతున్నది. ఏమాటకు ఆమాట అర్థమౌతూ ఉన్నట్టే ఉండి, మాటలను కలిపినప్పుడు వాటిసమిష్టి అర్థం అందకుండా పోతున్నది. ఇది మాటల తప్పుకాదు. మాటలచేత వూడిగం చేయించుకోవలసిన కవి తప్పు. పాతకాపుల్లాంటి కవులం కొత్తకారు కవులనుంచి నేర్చుకోవలసిన పాఠాలలో ఇది ఒకటి

''వక్తించు'', ''స్వేదించు'' వంటి అసాధారణ ప్రయోగాలను అటుంచినా, ''అర్జనుడు'', ''ఉచ్ఛరించు'', ''కూకటివ్రేళ్లు''లాంటి అపశబ్దాలనుకూడా కృష్ణారావుగారు ప్రయోగించడం ఆశ్చర్యం కలిగిస్తుంది అలాంటి మరొకశబ్దం ''అస్థిత్వం''. గ్రాంధికభాషాశబ్దాలను వాడుకోదలచిన యెవరైనా, వాటి సుష్ఠుస్వరూపాన్ని గౌరవించడమే బాగుంటుంది, లేదా వాటిని మొత్తంగా నిరాకరించి, వ్యావహారికభాషాశబ్దాలనైనా ఆశ్రయించాలి కవిత్వంలో యిది పూర్తిగా సాధ్యంకాదు వచనంకంటె ఎక్కువ సంఖ్యలో కవిత్వం గ్రాంధికభాషా శబ్దాలను స్వీకరిస్తుంది. కృష్ణారావుగారు క్రియాపదాల గ్రాంధికరూపాలనుకూడా అక్కడక్కడ వాడుతూనే వున్నారు.

ఇలాంటి స్వల్పవిషయాలను పక్కకునెట్టి, కవిగారి మనస్సును బోదపరచుకోదలిస్తే, అది వెన్నలాంటిదనిపిస్తుంది. దానికి కరిగిపోవడమే తెలుసుగాని గట్టిపడడం తెలిసినట్టులేదు. జీవితకార్కశ్యంముందు జాలికి జాగాయేలేదుగదా, అలాంటప్పుడు కురుక్షేత్రసమరాంగణంలో కింకర్తవ్యతా విమూఢుడైన అర్జునుడిలా 'ఏదిదారి' అంటూ దిగ్భ్రమచెందే మనిషిని చూచి మొత్తబుద్ధౌతుంది. 'మంచికీ చెడ్డకూ మధ్యన' ఉన్న మనిషి సందిగ్ధంలోపడితే 'సంశయాత్మా వినశ్యతి' చందమౌతుంది. చెమర్చడం మానినకళ్ళనుంచి విస్ఫులింగాలు రాలకపోతే, కన్నీటిబొట్లనుంచి ప్రళయాగ్నులు ప్రజ్వ

ల్లకపోతే, సామాన్యమానవ సముదాయం నిజంగానే 'ఓడిన సైనికుడులా' చూస్తూ ఉండిపోకతప్పదు. బలహీనత ఒక సుగుణంగా చలామణీకావడానికి మరి వీలులేదు. పౌరుషం తలవంచినప్పుడు అది పౌరుషమేకాబోదు. తమ ఉనికికి మరెవరో బాధ్యత వహించబనిలేదు. ఈ నరకాన్ని తోసిరాజనగలశక్తి తమకే ఉంది. 'మహాక్రాంతి కాలం' వెనక్కు వెళ్లిపోయింది. ఆయుధపూజ కూడా జరిగిపోయింది. ఆయుధధారులు ఒరిగిపోయారుగాని ఆయుధావశ్యకత అంతరించలేదు. ఉండి వుండీ ఊర్పులనుంచి సెగలూ పొగలూ వెలువడుతూ ఒక మహాదావాగ్నిని సూచిస్తున్నాయి. కృష్ణారావు గారుగానీ మరోకవిగానీ చూడాల్సింది ఈ సూచనలనే. కృష్ణారావుగారి "రేపు" విప్లవ కవికి ' నేడు".

—కె. వి. రమణారెడ్డి.

# విప్లవమంటే...

"ప్రపంచమొక పద్మవ్యూహం
కవిత్వమొక తీరని దాహం"

ఈ రెండు వాక్యాలకూ సమన్వయం, సంబంధం వుందో లేదోగాని రెండూ వాస్తవాన్ని ప్రకటించే వాక్యాలు.

ఈ రెండూ సి. వి. కృష్ణారావుగారి 'మాదీ మీవూరే' అనే కవితాసంకలనంలో మనకు కన్పిస్తయ్.

ప్రపంచమొక పద్మవ్యూహం. అనామకులకు, క్షుదార్తులకు దరిద్రులకు చాలా అన్యాయంగా వుంది ప్రపంచం. విడని చిక్కుగా, ఛేదించలేని పద్మవ్యూహంగా వుంది. తన్నుకులాడిపోతున్నారు. ఈ సత్యాన్ని కవి అడుగడుగునా గమనిస్తున్నారు. అందుకే అనామకుల, దరిద్రుల సంగతులే వివిధకోణాలనుండి ఎత్తుకుని చూపుతున్నారు.

'మాదీ మీవూరే మహారాజకుమారా !' అనే మొదటి ఖండిక పూర్వం 'సృజన' లో ప్రచురించబడి విశేషాదరణ పొందినది మహారాజకుమారుడూ, నిరుపేద అనామక

వెనకబడిన జాతి పిల్లవాడూ వుంటారు యిందులో. ఇద్దరి, రెండువర్గాల, అత్యధిక పీడితవర్గాలు, ఊరుకు ఒకరిద్దరే వుండే పరాన్నభుక్కు వ్యక్తులుగల, గ్రామ జీవితం ఉన్నదున్నట్టు ఎత్తిచూపారు.

"'చిన్నబాబు' వోతుంటే
"త్రోవలో నీవెందు"కని
తరిమి కొట్టబడిన
తూలనాడ బడిన
తెరువరిని నేను"
అంటాడు పేదబాలుడు
"మాతండ్రికి చూపుండదు
మాతల్లి వంగిన విల్లు"
మా ముత్తాతలు ముష్ఫైమందట
మరినేడు మేము
గవ్వల గజ్జల మొలతాళ్ళను
చూచుకొని మురిసే దిగంబరులం
మూడొందల మందిమి.
మనుపిచ్చిన జాగాలోనే
మురిగిన యీగల్లాగా
మనుగడ మనకిక్కడ కాదని
మనమూ మానవులమేనా అని
మంచి అనే మృగతృష్ణలో
మన్నుతున్నవాణ్ణి నేను
మాదీ మీవూరే మహారాజకుమారా!

"ఎటుచూచిన ఒకటే కథ"
ఈబాధా సన్నివేశాలగాధ
ఒక మూలన ఒడిచాచిన శిశువులు
ఒకమూలన ఎంగిలి మెతుకుల గతుకులు
ఒకమూలన వృద్ధాప్యపు చితుకులు.

'కవిత్వమొక తీరనిదాహం' అనేది కూడా వాస్తవమే. కవిత్వ ప్రయోజనం ఏమిటి? ఎందుకు రాస్తారు. ఎందుకు. ఎలా రాయాలి అనేవి నిరంతర, అనాద్యనంతమైన ప్రశ్నలు. ఎవరికివారు ఎప్పటికపుడు సమాధానాలు చెప్పుకుంటారు. సామాజిక

ప్రయోజనం అని యివాళ చాలామంది అంటున్నారుకాని అయినా ఆ సామాజిక ప్రయోజనం అనేదానికి నిర్వచనం అనేకానేకరకాల వుంటున్నది.

ఈ సందర్భంగానే 'కవిత్వమొక తీరనిదాహం' అనేది రుజువవుతుంది. ప్రయోజనాప్రయోజనాలెలావున్నా కవిత్వమొక తీరనిదాహం.

సి. వి. కృష్ణారావుగారికి ఆ దాహంవుంది కాబట్టే యీ రచనలు. ఇవి ఎవరికి అర్థం అవుతయ్. ఎందుకుపయోగపడతయ్ అనేది తర్వాత సంగతి. ఎక్కువమందికి అర్థంకావటమూ, చదువరులను ఉత్సాహపరచడమూ, కదిలించటమూ, దారిజూపటమూ యివి తప్పక కవిత్వానికుండాల్సిన లక్షణాలని నిర్ణయిస్తేమాత్రం ఆ కొలబద్ద యీకవిత లకు వర్తించదు. ఆరకమైన స్పష్టత. విస్పష్టత, ఉద్రేకమూ, యీరచనల్లోకానరాదు.

కవికి కవితాదాహం వుంది. అందుకు రాయటం జర్గుతున్నది. ఆ రాయటంలో వందిమాగధ స్తోత్రాలో, పిచ్చి ఆవేశాలో, ఊహాప్రేమ వైయక్తిక సంగతులోకాక చుట్టూవున్న సమాజంలోని బాధల, అన్యాయాల సంగతులూ దరిద్రుల దురదృష్ట వంతుల గాథలూ పైకి కవి మనసునుపోనిచ్చి వాటికి హృదయం స్పందింపజేసుకొని చేసిన చిత్రీకరణలు యీ కవితల్లో మనకు కన్పిస్తయ్.

Statements గా కాకండా ఉద్వేగంతో, ఉత్సాహంతో. జాలితోకరిగే రీతిలో నడకసాగే శైలిని, రీతిని కలిగించుకుంటే కృష్ణారావు గీతాలు కొంత సంచలనాన్ని కలిగించే వీలుంటుంది.

సృజన ప్రచురణలంటే విరసం సాహిత్యమే, విప్లవకవితలే వుంటయ్యనుకొని, విప్లవమంటే కత్తులూ కఠార్లు, నెత్తురూ తుపాకులే అని భావించి ఆశించేవారికి యీ ప్రచురణ ఆశాభంగం కల్గిస్తుంది.

విప్లవ కవిత్వమన్నా, 'సృజన' అయినా ఆ సంకుచిత పరిమితులకులోనైనదే కాదు, విస్తృత పరిశోధనలూ ప్రయోగాలూచేసే వేదికలుగా భావించితే యీ ప్రచురణ కూడా స్వీకారయోగ్యమే.

—అట్లూరి రంగారావు.

---

[మాదీ మీవూరే– కవితా సంకలనం– సి. వి. కృష్ణరావు. సృజన ప్రచురణలు; ప్రతులకు: 4/729, కుమార్‌పల్లి, హనుమకొండ, వరంగల్-1, వెల: 1 రు. ]

# సూరీడుంటే సీకటిలేదు

20 పేజీల ఈ చిన్నపుస్తకంలో, పల్లెటూరి భాషలోరాసిన 10 పాటలున్నాయి. ప్రతిపాటలోనూ, పాటలోని ప్రతి పాదంలోనూ కవిత్వం, భావస్పష్టత, వర్గచైతన్య చిత్తశుద్ధీ ఉన్నాయి.

మచ్చుకి—

సూరీడు పాటలో

'సత్తేన్నిరా నేను
నాకు సావేలేదు....
.... .... .... .... ....
.... .... .... .... ....
రోజురోజూ పిరికి
సన్నాసి సత్తాడు
ఉక్కురా నాగుండె
ఈగుండె సావదు.

యేల (అంటే వెల)— లో—

నిన్నునీవే తిట్టుకొంటావు ఏందిరా?
జలమమేం సేసింది ఎంకా—?
సేతగానితనము నీలోన ఉండంగ
ఎవడేమి సేత్తాడు ఎంకా?

పోరాటం— లో,

మనకట్టమే మనకు కూడుపెడతన్నాది
మనధైర్నమే మనకు దారిసూపెడతాది.
ఓరికెందుకు తలను వంచాలి?
ఓరికెందుకు మనం దడవాలి?

.... .... .... .... .... ....

దేవుడంటా వాడు యాడ్నించివచ్చాడు?
పనిలేక పత్తుంటె కూడుపెట్టిత్తాడ?
షంగరాలా వాడు అందరికి మారాజు
పెమటతీయని నాడు పైసపారేత్తాడ?

వడిసేల గీతంలో—

తిప్పండి వడిసేల
కొట్టండి వుసిగా
పట్టండి కొడవల్లు
ఎత్తండి కసిగా

రివ్వుమని రాయెల్లి
లేపాల కాకుల్ని
సరుకైనా కొడవల్లు
కలుపు ముక్కల్ని....

ఓటు పాటలో

....పేదోల్ల మంచికే నడుం కట్టారయ్యా
పన్నులతో యిల్లకు కప్పులేత్తారయ్యా
ఆస్తి అక్కా యింక రద్దుసేసేత్తారు
మనకుండ యింటిని కలిపేసుకుంటారు.

కదలండి పాటలో

కట్టండి పిడికిల్లు
కొట్టండి జేలు
అడుగులో అడుగేసి
కదలండి వేలు.

* * *

లచ్చగుండెల కోర్కె
ఊర్కెట్టా పోద్ది?
నాలుక్కోడెల మద్దె
పులెట్టా బతుకుద్ది?

ఇవి ఈ పుస్తకంలోని పాటల్లో కొన్ని మచ్చుతునకలు. వీటికి టీకా టిప్పణులు అనవసరం. చదివిన ప్రతి బాధాసర్పదష్టుడైన రసజ్ఞుడికి ఎక్కడా తట్టుకోకుండ గుండెల్లోకే జారి, కోటిన్నొక్క ఆశాదీపాల్ని వెలిగించి బాధ్యతల్ని నెత్తినేసుకొని పనిచేస్తాయి ఈ గీతాలు.

ఈ పుస్తకం చదవగానే అనిపించేది.... ఇది తెచ్చిపెట్టుకోలు ప్రయత్నంగాదని. ఇందుకు కవిని అభినందించితీరాలి.

పై ఆరూకాక సదువు— కులం— మతం— తలయెత్తు— నిప్పు— అనే ఇంకో నాలుగు పాటలుగూడా ఉన్నాయి.

ఇరవైపేజీల పుస్తకానికి యాభైపైసలు ధరెక్కువే ఐనా, విముక్తి పోరాటశీలంతో విప్లవోన్ముఖులైనవాళ్ళు, సానుభూతిపరులూ, సాంస్కృతిక బృందాలవాళ్ళు.... కడుపులో కములుతూన్న వర్గద్వేషానికి దూకుడుగా అక్షరాకృతి కావాలనుకుంటూన్న సోదరులూ.... తప్పక ఒకటి దగ్గరుంచుకోవాల్సిన పుస్తకం యిది. వచన గేయాలుకాక లయతప్పని పాటలు కావాలంటూన్న మిత్రుల్నోసారి ఈ పుస్తకం చూడమని కోరుతున్నాను.

—కె.

[సూరీడు : రచన : యం. కె. సుగమ్‌బాబు, వెల : 50 పైసలు. ప్రతులకు రచయితపేర చిన్నబజార్, గుంటూరు-3 అని రాయాలి.]

## రచయితలకు మనవి.

కొందరు రచయితలు ఊరు, పేరు, చిరునామా ఏమీలేకుండా, ఇచ్చిన పేరుకూడ కలంపేరో, అసలుపేరోకూడ తెలుసుకోరాకుండా రచనలు పంపుతున్నారు. రచనలోని సాహిత్యవిలువలను చూసి మాత్రమే ప్రచురించే నియమం సృజనకున్నా, కనీసం రచయితకు కాపీ పంపించడానికైనా చిరునామాయివ్వడంమంచిది.

— సంపాదకుడు.

## యువరచయితల నాహ్వానిస్తున్నాం!

మా యువరచయతల సమితిలో సభ్యులుగా చేరినవారికి ఈ క్రింది సదుపాయాలు లభిస్తాయి

1. ఆరు రూపాయల విలువగల మా ప్రచురణలు నాలుగు పుస్తకాలు వుచితంగా మీకు లభిస్తాయి.
2. సభ్యులైనవారి రచనలకు మా ప్రచురణలలో ప్రాధాన్యత యివ్వబడును.
3. సమితి జరుపు ప్రతి కార్యక్రమంలో వారు పాల్గొనవచ్చును.
4. సమితి కార్యకలాపములు ఎప్పటికప్పుడు తెలియజేయబడును.
5. ముస్ముందు అచ్చువేసే పుస్తకాలన్నీ వుచితంగా లభిస్తాయి.

పై సదుపాయాలు మీకు లభించాలంటే సంవత్సర సభ్యత్వరుసుము అయిదు రూపాయలు చెల్లించవలసి యుంటుంది.

కార్యదర్శి

యువరచయితల సమితి

SRJANA Telugu Monthly August '71 Regd. No. H-1088

నాలుగేళ్ళుగా
త్రైమాసిక పత్రికగా
ఆధునిక సాహిత్యంలో
అపూర్వ సంచలనం కలిగించిన

# సృజన

మాసపత్రిక ఏడవ సంచిక మీ చేతిలోవుంది
దీనిని మాసపత్రికగా నిలుపుకోవాల్సిన బాధ్యత మనందరిదీ.

- నేడే చందాదారులుగా చేరండి
- 'సాహితీ మిత్రులు'గా చేరండి
- విరాళాలివ్వండి
- ప్రకటనలివ్వండి

మీ మీ శక్తి కొలది సహకరించండి

సంవత్సర చందా : పది రూపాయలు
అర్థ సంవత్సర చందా : ఆరు రూపాయలు
విడి ప్రతి : ఒక రూపాయి

వివరాలకు : సృజన, 4/729 కుమార్‌పల్లి,
హనుమకొండ, వరంగల్–1 (ఆం. ప్ర.)

Edited and Published by Varavararao for 'Sahithee Mithrulu'.
Printed at Venkataramana Mudranalayamu,
J. P. N. Road, Warangal-2 (A.P.) 1 Re.